

10-1-60 న ప్రమాణ స్వీకారం చేస్తున్న రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ డి. సంజీవయ్య



ఆంధ్రప్రదేశ్ నూతన మంత్రివర్గం: (ఎడమనుండి కుడికి: కూర్చున్నవారు) 1. శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి. 2. శ్రీ పిడతల రంగారెడ్డి, 3. శ్రీ అల్లూరి సత్యనారాయణ రాజు, 4. శ్రీ దామోదరం సంజీవయ్య. 5. గవర్నరు శ్రీ భీమసేన్ సచార్, 6. శ్రీ కొండా వెంకట రంగారెడ్డి, 7. శ్రీ కల్లూరి చంద్రమౌళి. 8. శ్రీ మందుముల నరసింగరావు, 9. శ్రీమతి మసూమా బేగమ్, (నిలుచున్న వరుసలో) యెడమనుండి రెండవవారు ప్రధాన కార్యదర్శి శ్రీ ఎమ్.పి. పాయ్. తర్వాత 10. శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ, 11. శ్రీ మల్లిపూడి పళ్ళంరాజు, 12. శ్రీ బలుసు ప్రభాకర పట్టాభి రామారావు, 13. శ్రీ ఆనం చెంచు సుబ్బారెడ్డి, 14. శ్రీ నూకల రామచంద్రారెడ్డి, 15. శ్రీ పూసపాటి వెంకట గజపతి రాజు.

# ఆంధ్ర ప్రదేశ్

సంపుటి 4 ఫిబ్రవరి, 1960 సంచిక 4

మాఘం, శకము—1881

## విషయ సూచిక



**ముఖచిత్రం**

"గ్రామ ప్రసారం": అనాదినుండీ పల్లెటూళ్లలో ప్రసార సాధనం చాటింపే. (నిజామాబాదు జిల్లా బంజేపల్లిలోని ఒక దృశ్యం).

**వెనుక అట**

పొలంలో: జాతికి ప్రాణదాత అయిన ధాన్యాన్ని పండించే జీవిత విధానం. జామాబాదు జిల్లాలోని ఒక దృశ్యం).

చందా వివరాలు :

సంవత్సరానికి ... 2 రూపాయల 16 నయాపైసలు.

విడిప్రతి వెల .. 18 నయాపైసలు,

Edited and Published by the Director of Information and Public Relations, Hyderabad
Printed at : Vir Milap Press, Mukaramjahi Road, Hyderabad.

# కథానికల పోటీ

"ఆంధ్ర ప్రదేశ్" తెలుగు, ఉర్దూ సంచికలకై కథానికల పోటీ నిర్వహించబడుతుంది.

ఒక్కొక్క భాషలో ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలను పొందిన కథలకు వరుసగా రూ. 200, రూ. 100, రూ. 50 బహుమతులు యివ్వబడుతాయి.

కథలను టైపు చేయించి లేక చక్కని దస్తూరీలో అక్షరాలు తెలిసేట్లు వ్రాసి నాలుగు ప్రతులలో పంపాలి. అవి స్వతంత్ర రచనలయి ఉండాలి. అనువాదాలు. అనుసరణలు అంగీకరించబడవు. కథ స్వతంత్ర రచన అనీ, అది మరెక్కడా ప్రచురించబడలేదని తెలిపే రచయిత సర్టిఫికెట్టు కథతో పాటు జతచేసి పంపబడాలి.

కథ 4000 మాటలకు మించ కూడదు. ఇతివృత్తం ఆంధ్ర ప్రదేశ్‌లో ఏదో ఒక జిల్లా జీవితానికి సన్నిహితమయి, స్థానిక సంప్రదాయాలకు సంబంధించి ఉండాలి.

ఈ విషయంలో యిందు నిమిత్తం నియమించబడిన సంఘం నిర్ణయమే తుది నిర్ణయం.

కథల సమర్పణకు 1960 ఏప్రిల్ 1వ తేదీ ఆఖరురోజు. ఆ తేదీ తరువాత వచ్చే కథలు పరిశీలించబడవు.

రచయిత పేరు, పూర్తి చిరునామా విడిగా ఒక కాగితంపై వ్రాయబడాలే కాని కథ ప్రతులలో యెక్కడా ఉండకూడదు.

పోటీకి పంపే కథలను ఆంధ్రప్రదేశ్ సమాచార పౌర సంబంధాల శాఖ డైరెక్టరు, హైద్రాబాద్—1, చిరునామాకు పంపాలి.

# రథోత్సవము

—"ప్రణవశ్రీ"

లాహోరు మొల్క—పూర్ణ స్వరాజ్యపు కోర్కె—
తీవ్రమై, ఫలము పొందిన దినమ్ము!
రెండు వందల యేండ్ల నుండి మాసిన చీర
భరతాంబ మార్చిన పసిడి పొద్దు!
ముప్పదెన్మిది కోట్ల ముక్త కంఠమ్ములు
జయగీతి పాడిన సౌఖ్య దినము!
బడుగు గుండియలోన బ్రదుకుపై క్రొందీపి
పరిమళించిన పరువంపు రోజు!

ప్రాగ్ధరా స్వర్ణ గేహాళి ప్రాంగణమున
ప్రగతి భావ నవోదయ పద్మరాగ
రంగ వల్లులు విరిసిన రమ్యవేళ!
అమ్మహా పర్వదివస దీవ్యద్దశాబ్ది
కోత్స వోత్సాహ పవనమ్ములొలసె నేఁడు!
జాతి, మత, వర్ణ, వర్గ-విచక్షణమ్ము,
రాష్ట్ర, భాషా, వయో, రూప-రగడ-విడిచి
రండు మీరు ప్రజా రాజ్య రథము లాగ!

—:0:—

# ముందున్న గురుతర బాధ్యతలు

ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రిగా పదవీ స్వీకారం చేసి, 1960 జనవరి 11 వ తేదీన శ్రీ డి. సంజీవయ్య ఆకాశవాణి, హైదరాబాదు నుంచి ప్రజానీకానికి యీ సందేశం అందించారు:

ఆంధ్ర ప్రదేశ్ ముఖ్య మంత్రిగా పదవిని స్వీకరించిన తరువాత నేను ఈ రాష్ట్ర ప్రజలతో ఇప్పుడే తొలిసారిగా మాట్లాడుతున్నాను. ముఖ్యమంత్రిగా నన్ను ఎంచుకొనడం ద్వారా, ప్రజలు నాయందుంచిన విశ్వాసానికి నేను వారికి హృదయపూర్వకమైన కృతజ్ఞతను తెలుపుతుంటున్నాను. ఈ విధంగా ప్రజలు నాపై ఉంచిన బాధ్యతలను గురించి, భారాలను గురించి ఆలోచించే ముందు మరొక ముఖ్య విషయం నేను గుర్తించకుండా ఉండలేను. నన్ను ఈ పదవికి ఎంచుకోవడంలో మన రాజ్యాంగంపట్ల తమకున్న విశ్వాసాన్ని ప్రజలు చక్కగా ప్రదర్శించారు. అంతే కాదు. నేను ఏ కులానికి చెందిన వాడినో, ఆ కులానికి చెందిన, అనగా హరిజనులనబడేటటువంటి, కోట్లకొలది అణచబడిన బిడ్డలతో సహా మొత్తం దేశ ప్రజలందరకూ అవకాశ, హోదాలలో సమానత్వాన్ని సాధించాలన్న తమ ఆకాంక్షను కూడా నన్ను ఎంచుకోవడంలో మన రాష్ట్ర ప్రజలు ప్రదర్శించారు. ఏ మహాత్ముని నిరంతర కృషివల్ల మాత్రమే ఈ కోట్లకొలది అణచబడిన మన సోదరులకు సాంఘిక, ఆర్థిక, రాజకీయ, విద్యా సంబంధమైన అభివృద్ధి లభించిందో, ఆ మహాత్మునికి, జాతిపితకు, గాంధీజీకి భక్తితో, విధేయతతో, వినమ్రుడనై, అంజలి ఘటించడమే ఈ రోజున ఈ సమయంలో ప్రధాన కర్తవ్యం. ఆయన ఆత్మ మన దేశ భవిష్యత్తును అభ్యుదయ పథంలో నడిపించు గాక. ఆయన ఆశీర్వాదాలు నిరంతరం నాతో ఉండి, ఈనాడు నాకు అప్పగించబడిన గురుతర బాధ్యతలను నిర్వహించడంలో తోడ్పడుచుండు గాక.

ఈ సమయంలో, ఈ రాష్ట్ర ప్రజలే గాక, బహుశః భారత సమాఖ్యలోని అన్ని రాష్ట్రాల ప్రజలు కూడా నా మంత్రివర్గం అనుసరించబోయే విధానాలను, కార్యక్రమాలను గురించి నేను ఏదో కొంత చెపుతానని ఆశించడం సహజం. ఈ సందర్భంలో ఇప్పుడు జరిగింది మంత్రివర్గం మార్పు మాత్రమేనని, అధికారంలో ఉన్న పార్టీలో మార్పేమీ లేదని. అందువల్ల మా విధానాలలోను, కార్యక్రమాలలోను మార్పేమీ ఉండదని బహుశః మీకు చెప్పనక్కర లేదనుకుంటాను. అందువల్ల ఈ విధానాలను గురించి, కార్యక్రమాలను గురించి క్లుప్తంగా, యాథాలాపంగా ప్రస్తావించడం కంటె నేనెక్కువేమీ చెప్పనవసరం లేదు. మన ఆంధ్ర ప్రజల అభ్యుదయానికి, సౌభాగ్యానికి ముఖ్య హేతువులయిన అనేక ప్రధాన నిర్ణయాలను గత మూడేండ్లలోను మన ప్రభుత్వం తీసుకునే ఉన్నది. ఎప్పటివలెనే సోషలిస్టు పద్ధతి సమాజ నిర్మాణమే మన లక్ష్యంగా ఉన్నది. అందువల్ల, మా కార్యక్రమాలలో ప్రధానమైనది భూ సంస్కరణ. ఈ భూ సంస్కరణల కార్యక్రమం మన గ్రామ ప్రాంతాల భూమి యాజమాన్యంలో గల వ్యత్యాసాలను తొలగించడాన్ని లక్షిస్తున్నది. అంతే గాక, ఎవరి కాయకష్టం వల్ల భూమాత మనకు కావలసిన ఆహారాన్ని, ముడిద్రవ్యాలను ఫలిస్తున్నదో అట్టి కర్షకుడికి, వీలైనంత వరకు, భూమి పై హక్కును కలిగించడాన్ని కూడా ఈ భూసంస్కరణల కార్యక్రమం లక్షిస్తున్నది. ఈ కార్యక్రమంద్వారా మాత్రమే మనం సాంద్ర వ్యవసాయాన్ని ప్రోత్సహించగలం. ఇతోధిక ఉత్పత్తిని సాధించ

గలం, మరియు దేశానికి వెన్నెముక అయిన మన రైతాంగానికి సంతృప్తిని, సంతోషాన్ని ఈ కార్యక్రమ అవలంబన వల్లనే అందివ్వగలం. కాగా, మన భూవిధానం మార్పు లేకుండా యథాతథంగా సాగగలదు, మన రైతాంగపు సంక్షేమానికి ప్రాతిపదిక కాగలదు. తద్వారా మన వ్యవసాయాభ్యుదయానికి మూలాధారం కాగలదు.

## అత్యంత ప్రధాన ఘట్టం

ఈనాడు మనం ప్రజాస్వామిక ప్రభుత్వ పురోగతిలో ఒక అత్యంత ప్రధాన ఘట్టంలో ఉన్నాం. జిల్లా పరిషత్తుల ద్వారాను, పంచాయతీ సమితుల ద్వారాను లోగడ మనం అమలులో పెట్టిన ప్రాతిపదిక ప్రజాస్వామిక వ్యవస్థల మూలకంగా ప్రజాస్వామికాన్ని విస్తరింపజేసి, దానిని కేంద్ర ప్రభుత్వ శిఖరాల నుంచి మన ప్రజల వాకిలి గుమ్మాల దగ్గరకు తేవాలని సంకల్పించాం. ఈ క్రొత్త పథకంలో ప్రజలలో ఏకీకృతాభివృద్ధిని సాధించడం, వ్యక్తిలో ఆత్మవిశ్వాసాన్ని, స్వయం ప్రయత్నాన్ని ప్రోత్సహించడం-ఈ రెండు లక్ష్యాలు అంతర్భూతమై ఉన్నాయి. ఈ రెండు ప్రధాన లక్ష్యాలను నేనూ, నా సహచరులూ కొనసాగించగలం. ఈ లక్ష్యాలు, ఈ రాష్ట్రపు అభ్యుదయానికే గాక, మొత్తం భారత జాతి అభ్యుదయానికి అతి ప్రధానమైనట్టివి.

మనం ఇప్పుడు రెండవ పంచవర్ష ప్రణాళికలో నాల్గవ సంవత్సరంలో ఉన్నాం. ఈ ప్రణాళికలోని అన్ని కార్యక్రమాల విషయంలోనూ, మనకు ఆశించిన ఫలితాలే లభించాయి. అన్ని విషయాలలోను మన ఫలితాలు అఖిల భారత ఫలితాలకు ఏవిధంగానూ తీసిపోవు. గత రెండు సంవత్సరాలలోను సంతోషకరమైన, ప్రోత్సాహకరమైన విశేషమేమంటే, తెలంగాణా ప్రాంతంలోని అభివృద్ధి కార్యక్రమం కోస్తా, రాయలసీమ ప్రాంతాలలోని అభివృద్ధి కార్యక్రమ పురోగతిని అందుకొన్నది. మరిన్నీ ఈ లోగడదాన్ని అధిగమించింది కూడా. తెలంగాణా ప్రాంతపు అభివృది సత్వరంగా సాధింపబడడంతో, రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ నాటి నుంచి ఆంధ్ర, తెలంగాణా ప్రజల మధ్య ఏర్పడివున్న భేదభావం చాలావరకు తగ్గిపోగలదు. ఇప్పటికే పెద్ద ఎత్తున భావ సమైక్యత జరిగే ఉన్నది. ఇప్పుడు పార్టీ నాయకత్వానికి నన్ను ఏకగ్రీవంగా ఎన్నుకోవడం మొత్తం తెలుగు ప్రజలందరిలోనూ సమైక్యతాభావం సత్వర గతిని పెరుగుతున్న దనడానికి నిదర్శనమని నేను భావిస్తున్నాను.

వచ్చే తృతీయ ప్రణాళిక ఇప్పటి దానికంటె ఇతోధికాభివృద్ధిని కాంక్షిస్తున్నది. ప్రస్తుతం వ్యర్థంగా పోతున్న గోదావరి నీటిని తెలంగాణా ఉత్తర ప్రాంతాలలో అత్యధిక భాగానికి అందివ్వగల పోచంపాడు ప్రాజెక్టును, విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి దేశంలో అతి చవుక అయిన పెద్ద ప్రాజెక్టులలో ఒకటి కాగల శ్రీశైలం హైడల్ ప్రాజెక్టును, ప్రస్తుతం పని కొనసాగుతున్న అనేక వివిధ రకాల ప్రాజెక్టుల పరిపూర్తిని ఆ ప్రణాళికలో గ్రుచ్చడానికి నిర్ణయించాం. కొత్తగూడెం దగ్గర భారీ ఎరువుల కర్మాగారం, మన ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక అభివృద్ధి పథకాలకు భవిష్యత్ దర్శకం కాగలదు. తక్కిన అన్ని అభివృద్ధి రంగాలలోను కూడా ఇప్పటికే ఎంతో విశిష్టమైన సత్వరాభివృద్ధి జరిగింది. ఇకముందు కూడా జరుగనున్నది. ఇప్పటికే మనం మిగతా భారత దేశం అంతటికీ వ్యవసాయంలోను, వైద్య, ఆరోగ్య రంగాలలోను, సహకార, సమాజాభివృద్ధి విషయాలలోను ముందున్నాం. ఈ రంగాలలోను, తదితర రంగాలలోను గత మంత్రివర్గపు కృషి బలంతో మేము నిర్విరామంగా, ఇతోధికంగా పాటు పడుతూ ముందుకు సాగిపోగలమని ఆశిస్తున్నాను

ఈ సందర్భంలో ఇంతవరకు ముఖ్యమంత్రిగా ఉన్న శ్రీ నీలం సంజీవరెడ్డి గారిని అభినందించడం నా ముఖ్య ధర్మం. గత మూడు సంవత్సరాలలోను సాధింపబడ్డ అభ్యుదయం, తద్వారా భవిష్యత్తుకు వేయబడ్డ బలమైన పునాదులు కూడా ఆయన మహత్తర పరిపాలనా పాటవ ఫలితాలే. ఆయన రాజకీయ సత్త్వం, నిష్కళంక సౌశీల్యం, చిత్తశుద్ధి, పరిశ్రమ, స్వార్థత్యాగ పరాయణత మనందరకు లక్ష్యప్రాయమైనట్టివి. వివిధ మంత్రివర్గాలలో గత ఎనిమిది సంవత్సరాలుగా నేను ఆయన సహచరుణ్ణిగా ఉండడం ఎంతో అదృష్టం. గతంలో నేను ఆయన దగ్గర నుంచి పొందిన, భవిష్యత్తులో పొందనున్న సహాయానికి, మార్గదర్శకత్వానికి నేను నా హృదయపూర్వక కృతజ్ఞతలను అందజేస్తున్నాను. భారత జాతీయ కాంగ్రెస్‌లో అత్యున్నత స్థానానికి ఆయన వెళ్ళడమంటే అది ఆయన ఈ రాష్ట్రంలో, బయటనూ చేసిన మహత్తర కృషికి గుర్తింపు మాత్రమే ఆయన శక్తిసామర్థ్యాలను మొత్తం దేశం

అంతటికినీ వినియోగించే అవకాశం ఆయనకు కలిగినందుకు సంతోషిస్తూ, ఈ రాష్ట్ర వ్యవహారాల నియంత్రణ నుండి ఆయన వెళ్ళి పోతున్నందుకు అందరితోపాటు విచారిస్తున్నాను. "ఇది మనకు కష్టం, భారతదేశానికి లాభం". దేశ సేవ కొరకు ఇతోధిక ఆయురారోగ్య సౌభాగ్యాలను భగవంతుడు ఆయనకు ప్రసాదించు గాక.

తమ పరిపక్వ వివేకంతో, ఉదాత్తసలహాలతో, వ్యక్తి-విషయ పరిశీలక నిశిత దృష్టితో, ప్రజా సేవలో మంత్రిగా నన్ను ముందుకు నడిపించిన ఇతఃపూర్వపు ముఖ్యమంత్రులు శ్రీ సి. రాజగోపాలాచారి, ఆంధ్ర కేసరి ప్రకాశం, డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి గార్లను ఈ సందర్భంలో స్మరించడం, కృతజ్ఞత తెలుపుకోవడం నా కర్తవ్యం.

ఇప్పుడు మా కార్యక్రమాలను, మా భావి ఆశయాలను గురించి క్లుప్తంగా మాత్రమే ప్రస్తావించాను. ఎందువల్లనంటే మాకు అప్పగించబడ్డ కార్యక్రమాలను, విధానాలను మాత్రమే నా మంత్రివర్గం కొనసాగించవలసి ఉంది. ఇంత వరకు చాల కృషి జరిగింది. అయితే జరగవలసింది ఇంకా ఎంతో మిగిలే ఉంది. ఇకముందు నేను ఎదుర్కోవలసి వచ్చే అనేక కఠిన సమస్యలలో మీ సహాయ, సహకారాలు నాకు పూర్తిగా లభించవలసి వుంది. దారిద్ర్యం, అజ్ఞానం, అనారోగ్యం, వ్యాధి మున్నగు వాటిపై జరిగే పోరాటంలో సైద్ధాంతిక విభేదాలు ఉండడానికి వీలులేదు. కాబట్టి, మా అభ్యుదయ కార్యక్రమాలన్నింటి విషయంలోనూ, మాకు మద్దత్తు నివ్వవలసిందిగా, నా రాజకీయ ప్రతిపక్షాల వారిని నేను ముఖ్యంగా కోరుతున్నాను. ప్రజాస్వామిక వ్యవస్థలో అధిక సంఖ్యాకులు, అల్ప సంఖ్యాకులను తమతో తీసుకొని పోవలసి ఉన్నది. అల్ప సంఖ్యాకులు కేవలం ప్రతికూలన కోసమే ప్రతికూలించకూడదు. సర్వశక్తియుతుడైన సర్వేశ్వరుడు తన ఆశీర్వాద బలంతో మన అందరినీ ఎల్లప్పుడు కాపాడుతూ ఉందు గాక!

జైహింద్.



పతాకకు ప్రాతినిధ్యం వహించే వస్తువులను ఒక గొప్ప జాతి అనుభవాలు సృజించినవి. అది ప్రాతినిధ్యం వహించే ప్రతిదానినీ వారి జీవితాలు లిఖించినవి. అది స్త్రీ పురుషులు పొందిన అనుభవాలకు, ఆ పతాక క్రింద పని చేసి జీవించే వారి అనుభవాలకు ప్రాతినిధ్యం వహిస్తుంది.

— వుడ్రో విల్సన్

మనిషి అహంభావమే పబ్లిక్, ప్రైవేటు రంగాలలో పెక్కు తప్పుడు అభిప్రాయాలకు పుట్టిల్లేమో అనిపిస్తుంది.

— మాంటేగ్.

# "జనవరి 26"

— శ్రీ యస్వీ. సీతారామమూర్తి

రిపబ్లిక్ రిపబ్లిక్
ఏమన్నది పబ్లిక్ ?

కడుపు కాలే కర్షకులకు
కూడు గుడ్డా కలిగినాది
కష్ట జీవులు కార్మికులకు
కూలి నాలీ చూపినాది.

ఇల్లు గుల్లయి వళ్లు పాడై
జీవితాన్నే పీల్చి వేశే
మద్య పానం మాన మన్నది
మానవునిగా మసల మన్నది.

పెరగాలి ఆహార ఉత్పత్తియని
తరగాలి దారిద్ర్యపు నిష్పత్తియని
సోషలిష్టు సహ జీవనానికి
సహకార సేద్యమే శరణ్య మన్నది.

భూమి అంతయు ఒక్క చేతిలో
భుక్తమగుట భావ్యంబు కాదని
భూమి నంతను సంస్కరింపగ
కంకణంబును కట్టు కున్నది.

ప్రజా రాజ్యం, ప్రజా పాలన
ప్రజా స్వామ్యపు పాలనమ్మును
ప్రజాను రీతిగా పాలించమని
ప్రజల చేతిలో పెట్టినాది.

రిపబ్లిక్ రిపబ్లిక్
ఏమన్నది పబ్లిక్ ?

===

# రాష్ట్రంలో చేనేత పరిశ్రమ

— శ్రీ జి.వి.వి.బి. శర్మ

మనిషికి ఆహారం తరువాత వస్త్రం ముఖ్యావసరం. ఈ వస్త్రాన్ని ఉత్పత్తి చేయడంలోనేమి, రాష్ట్రంలో బహు జనావసరాలను తీర్చడంలోనేమి చేనేతవారు గర్వకారణ మయిన స్థానాన్ని ఆక్రమించుకున్నారు. మన రాష్ట్రం దశ దిశల నేడు యించుమించు 5 లక్షల మగ్గాలు ఉన్నవి. ఇతర రాష్ట్రాలలో ఏ ఒక్క దానిలోను యిన్ని మగ్గాలు లేవు.

ఇక్కడ మిల్లు వస్త్ర పరిశ్రమ అభివృద్ధి చెందలేదు. ప్రజల అభిరుచులు, అలవాట్లు స్థల స్థలానికి మారతాయి. ఇది పెద్ద రాష్ట్రం కావడాన యిక్కడ వేర్వేరు ప్రభావాలు ప్రసరిస్తాయి. ఇటువంటి పరిస్థితులలో చేనేత వారిపై గల బాధ్యత నిజంగా గురుతరమయినది. చేనేత వారు యీ పరిస్థితులను పూర్తిగా యెదుర్కొనడమేగాక ప్రజానీకం వివిధ అభిరుచులను కూడా తీరుస్తున్నారు. సువ్యవస్థితమయిన గ్రామ జీవితాన్ని కదపాలని మిల్లు పరిశ్రమ యెంత ప్రయత్నించీ సఫలం కాలేక పోయింది; ప్రజల వస్త్రధారణ అలవాట్లలో ప్రాథమిక మయిన మార్పులను తేలేక పోయింది. మిల్లు వస్త్రాల తళుకుకు లోబడిన స్వల్ప సంఖ్యాకులయినా వివాహాది శుభకార్యాలు వగైరాలకు విధిగా చేనేత వస్త్రాన్నే వాడుతారు.

అత్యవసర కాలంలో అవసరాలను తీర్చినదా లేదా అన్నదే యే సంస్థకయినా సరయిన పరీక్ష. చేనేత పరిశ్రమ గడిచిన యుద్ధ కాలంలో అట్టి పరిస్థితిలో తన కర్తవ్యాన్ని నెరవేర్చినది. మిల్లు పరిశ్రమా లేదు. ఉత్తర భారత దేశం, కోయంబత్తూరులనుంచి వచ్చేసరుకు సరఫరా పడిపోయింది. ఈ తరుణంలో చేనేతవారు ఆదుకొనక పోయినట్లయితే ఆంధ్ర విపరీతమయిన యిబ్బందికి గురి అయి వుండేది. చేనేత పరిశ్రమను అప్పటి బ్రిటిషు ప్రభుత్వం బుద్ధి పూర్వకంగా అణచివేసింది. ప్రజలలో కొన్ని వర్గాలు అధునాతన నాగరికత మాయలో బడి దానిని అశ్రద్ధ చేశారు. అయినా అవసర సమయంలో అది ప్రజలను ఆదుకొన్నది. చేనేత వారు అతి స్వల్ప కాలంలో పరిస్థితిని గ్రహించి మన రాష్ట్ర ప్రజానీకానికి సరిపడ వస్త్రాన్ని అందివ్వటానికి వారి బాధ్యతకిమించి పని చేశారు.

## ఉద్యోగ వసతులు

చేనేత పరిశ్రమ ప్రత్యక్షంగా 5 లక్షల మందికి పని కల్పిస్తుంది. అంతేకాక, యీ సంఖ్యకు కనీసం నాలుగు రెట్ల ప్రజలకు అది జీవనోపాధిగా ఉన్నది. అది పరోక్షంగా కూడా చాల మందికి పని కల్పిస్తుంది. నిజానికి-ఒక్క వ్యవసాయం వినా, రాష్ట్రంలోని మిగిలిన అన్ని పరిశ్రమల లోను పనిచేసేవారి నందరనూ కలిపినా యీ పరిశ్రమలో పనిచేసే వారిలో సగమయినా ఉండరు.

మన రాష్ట్రానికి ప్రస్తుత అంచనాల ప్రకారం సాలుకి రమారమి 5,000 లక్షల గజాల వస్త్రం కావాలి. మన రాష్ట్రంలోని మిల్లులు చూదాస్తే కొన్ని లక్షల గజాలను మాత్రమే ఉత్పత్తి చేస్తున్నాయి. అనూచానమయిన మన చేనేత పరిశ్రమ లేకపోతే మన సొమ్ము యెంత బయటికి పోయేదో ఊహించవచ్చు. ఇప్పుడు మన రాష్ట్రంలో చేనేత పరిశ్రమలో రమారమి 3,000 లక్షల గజాల వస్త్రం ఉత్పత్తి అవుతున్నది. నిజానికి మన రాష్ట్రం పూర్తి అవసరాలను తీర్చే స్తోమత దానికి ఉన్నది.

సగటున ఒక్కొక్క మగ్గం మీద సాలుకి రూ. 300 లాభం అనుకుంటే, చేనేత పరిశ్రమ వల్ల రాష్ట్రానికి అధమం 1,500 లక్షల రూపాయలయినా మిగులుతాయి. దాని



కార్వాన్ అరబ్ లుంగీ.



చేనేత దుప్పట్లు, ద్వారాల తెరలు వగైరా.

శక్తి కొలదీ పనిచేయటానికి యీ పరిశ్రమకు ప్రోత్సాహ మివ్వబడితే యీ ఆదా రెట్టింపు కాగలదు.

## పునరుద్ధరణ

ఈ పరిశ్రమ మన గ్రామ ఆర్థిక వ్యవస్థలో ఒక ప్రధానాంశం. కాబట్టి దీని పునరుద్ధరణ గ్రామ పునరుద్ధరణలో అత్యంత ముఖ్యం. ముఖ్యంగా మన రాష్ట్రంలో, గ్రామమే రాష్ట్ర అర్థిక వ్యవస్థకు కేంద్రమై ఉన్నది.

చేనేత పారిశ్రామికులు వారి ప్రాథమికావసరాల విషయంలో పెక్కు చిక్కులకు లోనవుతున్నారు. నూలు విస్తారంగా బొంబాయి, మద్రాసుల వంటి రాష్ట్రాలనుంచి దిగుమతి కావలసి ఉన్నది. ఇందువల్ల వారు వస్త్ర పారిశ్రామికుల కళా కళలపై ఆధారపడవలసి రావడమే కాక నూలు ధర కూడా హెచ్చుతుంది. ఆపైన సాధారణంగా వారికి కావలసినంత నూలు, కావలసిన నాణ్యంలో లభించదు. చేనేత పరిశ్రమ తీవ్రమయిన మిల్లు పరిశ్రమ పోటీని యెదుర్కొనవలసి వుంది. ప్రజల అభిరుచులు మార్పు చెందుతూ వుంటాయి. వాటి కనుగుణంగా వారు వస్త్రాలను తయారు చేయాలి. ఈ పనులను నిర్వహించి ఆ పరిశ్రమ నిలవగలగాలంటే దానికి ప్రధానంగా కావలసిన నూలు విషయంలో రాష్ట్రం స్వయం సమృద్ధంగా ఉండాలి. కాబట్టి యిందుకు తగిన చర్య తీసుకొనబడాలి.



(1960 సం॥ జనవరి 31 వ తేదీ నుంచి ఫిబ్రవరి 7 వ తేదీ వరకు దేశమంతటా యేడవ అఖిల భారత చేనేత సప్తాహం జరుపబడ్డది.)

* * *

మొండి మనుషులు నక్క వినయాన్ని చూపించ వచ్చు, కాని వినమ్రులు ఎప్పుడయినా మొండితనాన్ని నటించగలిగితే మాత్రం నే చెవి తెగ్గోసుకుంటాను.

— గోల్డుస్మిత్

# ప్రబోధము

— విద్వాన్ వెంకటయ్య

క్రమముగా-పంచవర్ష ప్రణాళికలకు
బటువైన చక్కని పట్టు గొమ్మ,
లాదర్శ గ్రామ భాగ్యా నందములకు ని
త్యము వికాసము గూర్చు నాట పట్టు,
లధికార వర్గ గ్రామా నధికార వ
ర్గాల కైక్యము గూర్చు రాయ బారు,
లభివృద్ధి కార్య క్రమాళి నందించి సే
వింపంగ బొడమిన వేగు చుక్క,
అన్ని విధముల మనకు తోడై ప్రభుత్వ
గౌరవంబును నిలబెట్టు వార లీరు
సగము కర్చుతో సాయమ్ము సలుపు వారు
మేలు కోరు వారు డెవలప్ మెంటు వారు.

.... .... ....

పరి గడుపున నుండి పసుల కాపరులయ్యు
కన్న వారికి గూర్చు పిన్నలార !
పగలెల్ల కుల వృత్తి పాటించి తండ్రికి
ఉత్సాహ మొనగూర్చు యువకులార !
బాధ్యతల్ పైబడి బాధింప క్షణము వి
శ్రాంతి నెఱుగని సంసారులార ?
వంట వార్పులనియు నింటి పనుల మున్గి
వాకిళ్లు దాటని వనితలార !
అక్షర జ్ఞానమును బొంద నాదరమున
రాత్రి బడులకు తప్పక రండి ! రండి !
సగము కర్చుతో సాయమ్ము సలుపు వారు
మేలు కోరువారు డెవలప్ మెంటు వారు.

చదువ వ్రాయను నేర్పి సంస్కారి నొనరింప
నయ్యవారి నౌకరి నంపినారు
మబ్బును పోఁదోలి మఱిమఱి వెలుగుల
నిచ్చు దీపంబుల నిచ్చినారు
వ్రాసి దిద్దను దిద్ది వ్రాయంగ నసువైన
మంచి పలకలు పంపించినారు
అక్కరములు మొద లంత విజ్ఞానమ్ము
నొసగెడి పొత్తమ్ము లొసగినారు
పత్రికలు వచ్చు వీళ్లు నేర్పఱచినారు
పైన తనిఖీలు పెట్టిరీ బడుల కెల్ల
సగము కర్చుతో సాయమ్ము సలుపువారు
మేలు కోరువారు డెవలప్ మెంటు వారు....

పన్నురూకల రసీ దున్నదున్నట్టుల
తెలిసికో గలిగెను తిమ్మిరెడ్డి
ఎదురు పట్టీలలో నెన్ని తాన్లున్నవో
చదువుకో గలిగెను శంకరయ్య
పంచాయతీ బోర్డు మంచి చెడ్డలు కొన్ని
యోచింప గలిగెను ఓబులన్న
తమవారిలో కొఱంతలు తీర్చు విధమేదో
సూచింప గలిగెను సుబ్బు లక్ష్మి
ఊరి వసతులు తీర్పగా యువజనమ్ము
పాటుపడ గల్గె నీరాత్రి బడుల వలన
సగము కర్చుతో సాయమ్ము సలుపు వారు
మేలు కోరువారు డెవలప్ మెంటు వారు.....

.... .... ....

ఏ హాని చేయక దేహ బలమ్మున
మేలొనర్చెడి బ్యాటు మెంటు నాట
కరచరణమ్ముల కిరవంద బలమిచ్చి
పన్నె నొసంగెడి వాలిబాలు
కాలి తన్నులతో చకాచక పరువెత్తి
పో బల మిచ్చెడి ఫుట్టు బాలు

చిన్నలు పెద్దలు చేరి సంబరమున
రివ్వున విసరెడి రింగు బాలు
పలు రకమ్ముల బంతులు, వలలు, బ్యాట్లు
ఇచ్చి వ్యాయామమునకు చేయిచ్చు వారు
సగము కర్చుతో సాయమ్ము సలుపు వారు
మేలు కోరు వారు దెవలప్ మెంటు వారు....

.... .... ....

నీతి దయా సత్య నిర్మల గుణముల
కాట పట్టులు మన నాటకములు
వీర కరుణ రసావేశ హాస్యములకు
పుట్టి నిండ్లగు మన బుఱ్ఱ కథలు
భక్తి వేదాంత విరక్తి కీర్తనలకు
నిజ గేహములు మన భజన జట్లు
నవరసోచిత సాభినయ భంగిమములకు
నవ జీవములు మన నర్తనములు
వృద్ధి సేయగ, కొత్తవి వెలయ నేయ
ప్రొద్దు ప్రొద్దున మనలను ప్రోత్సహించు
సగము కర్చుతో సాయమ్ము సలుపు వారు
మేలు కోరు వారు దెవలప్ మెంటు వారు....

.... .... ....

ఆయురారోగ్యమ్ము లభివృద్ధి నందింప
నాసు పత్రులు మన కవసరమ్ము
సాయం సమావేశ సంత సమ్మును గూర్చు
క్లబ్బులు మనకు నక్కఱయెె సుమ్మ
అక్షరారంభ విద్యా ప్రదానమునకు
బడులును మనకు కావలయు గాదె
వివిధ వార్తాశేష విజ్ఞానదమునకు
పఠన మందిరములు మనకు వలయు
కాన మన బాగు నెంచుచు కన్ను గలిగి
సంఘ శక్తితో ముందుకు సాగిరండు!
సగము కర్చుతో సాయమ్ము సలుపు వారు
మేలు కోరువారు దెవలప్ మెంటు వారు.

# పట్టణాల కొక ప్రణాళిక

— శ్రీ యల్.ఎన్. గుప్త.

( సమాజాభివృద్ధి ఉద్యమం ఇప్పటికే గ్రామీణ ప్రాంతాలలో ఆరోగ్యకరము, అభ్యుదయ కరము అయిన జీవనాన్ని ప్రసాదిస్తున్నది. ఇక ఈ ఉద్యమాన్ని పట్టణ ప్రాంతాలలో ప్రవేశపెట్టి అక్కడ గల పెక్కు లోపాలను తొలగించి, జీవన ప్రమాణాన్ని వృద్ధిపరచవలసిన సమయం ఆసన్న మయింది. 1959 డిసెంబరు ఆఖరు వారంలో, హైదరాబాదులో "పట్టణ ప్రాంత సమాజాభివృద్ధి" పై జరిగిన గోష్ఠిలో ప్రసంగిస్తూ శ్రీ యల్.ఎన్. గుప్త, ఐ.ఎ.యస్, అట్టి కార్యక్రమం అమలుకై దేశంలోని పట్టణ ప్రాంతాల ప్రజలందరికీ వర్తించే పథకాన్ని ఒక దానిని సూచించారు.)

''గ్రామాలే నిజమయిన భారత దేశము" అన్న సూక్తి అక్షరాలా నిజం. ఎందుకంటే మన ప్రజానీకంలో నూటికి 80 మంది పల్లె ప్రాంతాలలోనే నివసిస్తున్నారు. వ్యవసాయోత్పత్తిలో అధికభాగం పల్లెలనుంచే వస్తున్నది. ఆర్థిక స్వాతంత్ర్యం, ముఖ్యంగా ఆహార స్వయంసమృద్ధి, సాధన విషయంలో గ్రామాభివృద్ధి ముఖ్యపాత్ర వహించటం సబబుగా వుంది. పల్లెలలో మరీ తక్కువగా వున్న జీవన ప్రమాణం అభివృద్ధికి దేశ ఆర్థిక ప్రణాళికలో హెచ్చు ప్రాధాన్యత ఇవ్వబడాలి.

నిర్ణీతమైన గ్రామ ప్రాంతాలలో ప్రజా సహకారంతో తీవ్రాభివృద్ధికై ప్రయత్నం చేసి చూడటానికి సమాజాభివృద్ధి కార్యక్రమం తయారు చేయబడింది. చిన్నచిన్న నీటి వనరుల అభివృద్ధి, సరయిన ఎరువుల వాడకం, తదితర ఆధునిక వ్యవసాయ పద్ధతుల బోధన ద్వారా ప్రభుత్వం, స్వచ్ఛంద సంస్థలు ప్రాథమికావసరాలను తీరుస్తున్నాయి. శ్రామికులు, గ్రామీణుల స్వయం వికాస సమితుల వంటి సంస్థల యేర్పాటు యీ కార్యక్రమములో ముఖ్యాంశాలై వున్నాయి.

వైద్య సదుపాయాలు, ప్రజారోగ్యం, పారిశుద్ధ్యం, విద్య, విద్యార్థులకు భోజన వసతులు, వినోద, విజ్ఞాన వంటి సాంఘిక కార్యకలాపాలకు ప్రాథమిక ఆరోగ్య కేంద్రం, బ్లాకు అభివృద్ధి అధికారి, సోషల్ ఎడ్యుకేషన్ ఆర్గనైజర్, గ్రామ సేవక, గ్రామ సేవికలు ఆధారభూతులు అవుతున్నారు. చేసిన పరిశోధన అనన్యమయిన విజయాన్ని సాధించింది. ఈ కార్యక్రమం పల్లె ప్రాంతాల్లో అభివృద్ధి కార్యకలాపాలపట్ల ఉత్సాహాన్ని, గ్రామీణులకు ధన ధాన్యాభివృద్ధిని పొందాలన్న ఆత్మ వివేకాన్ని కలిగించటమే గాక, దీన్ని పూర్తిగా అమలు జరపటానికి దృఢ సంకల్పులై తరిఫీదు పొందిన కార్యకర్తలను కూడ తయారుచేస్తున్నది. అతి త్వరలోనే దేశంలోని పల్లె ప్రజలందరికీ యీ కార్యక్రమం ఉపకరించగలదు.

## పట్టణాల ప్రాథమికావసరాలు

పట్టణ ప్రాంత సమస్యలపై కూడ దృష్టిని కేంద్రీకరించవలసిన సమయం వచ్చింది. ఇక్కడి జీవన విధానాన్ని అభివృద్ధి పరచటానికి చేసిన ప్రయత్నాలు, ప్రణాళికలో ఇందుకు కేటాయించిన వనరులు అవసరాలకు తగినట్లు లేవు. గృహవసతి సౌకర్యాల అభివృద్ధికి, మురికి పేటల తొలగింపుకి గడచిన కొంత కాలంగా ఎక్కువ ప్రాముఖ్యం

ఇవ్వబడుతున్నది. ఈ సమస్య చాల విస్తారమయినది గావటాన చేయవలసినది ఇంకా చాలా మిగిలివుంది. పట్టణ నిర్మాణ ప్రణాళిక పట్ల తగు శ్రద్ధ చూపటం, జనసమ్మర్దమైన ప్రాంతాలలో పరిశుభ్రమయిన గాలి పీల్చుకోటానికి సదుపాయంగా అక్కడక్కడ కొన్ని మైదానాలను యేర్పాటు చేయటం అవసరం. విపరీతంగా పెరిగిపోతున్న కొన్ని నగరాలలో కొత్త పేటలను నిర్మించవలసిన ఆవశ్యకత ఎంతయినా వుంది. కొత్తగా మురికిపేటలను తలెత్తనీయ కూడదు.

అలాగే నీటి సరఫరా, మురుగు పారుదల సౌకర్యాల విషయంలో కూడ శ్రద్ధ చూపబడుతోంది. అయినా ఇప్పటికి, పట్టణ ప్రాంతాల్లో నూటికి 15 మందికి మాత్రం రక్షిత నీటి సరఫరా, నూటికి పది మందికి మాత్రం నవీన మురుగు పారుదల సౌకర్యాలు సమకూర్చబడినాయి. దేశంలోని అన్ని పట్టణ ప్రాంతాలకు యీ రకమయిన సదుపాయాలు కలుగజేయటానికి కనీసం 15—20 సంవత్సరాలు పడుతుందనీ, 175 కోట్ల రూపాయలు వ్యయం కాగలవని అంచనా వేయబడింది.

పారిశుద్ధ్యం విషయంలో, ఆధునిక మురుగు పారుదల పద్ధతులు పెంపొందేంత వరకు, పాకీదొడ్లు శుభ్రపరచే యేర్పాట్లు ఎక్కువ చేయబడాలి. ఈ సందర్భంలో పల్లె ప్రాంతాల నిమిత్తం చాల పరిశోధన చేయబడినది. పట్టణాలలో కూడ ఆ పద్ధతులనే తగిన మార్పులతో తాత్కాలికంగా అనుసరించ వచ్చు. పారిశుద్ధ్య పథకాలలో భాగంగా పాకీ పనివారికి సరియైన గృహ వసతి కల్పనకు, వారి స్థితిగతుల అభివృద్ధికి ఎక్కువ ప్రాధాన్యతనివ్వాలి.

## ప్రజారోగ్యం

ప్రజారోగ్య సౌకర్యాలు, ముఖ్యంగా అంటువ్యాధుల నిర్మూలన విషయంలో, పట్టణ ప్రాంతాలలో బాగానే వున్నాయి. అయినా యింకా కొంత అభివృద్ధికి అవకాశం వుంది. ముఖ్యంగా మశూచికము, మలేరియా, కలరాలను వీలయినంత తక్కువ కాలంలో నిర్మూలించటం మన ఆశయం కావాలి. భయానకమైన క్షయ వ్యాధి పట్టణ ప్రాంతాలను పట్టి పీడించి ఎంతో మందిని మృత్యువుకు గురి చేస్తున్నది. బి. సి. జి. టీకాలు, ఆసుపత్రులలో ఎక్కువ మంచాల యేర్పాటు, రోగుల ఇండ్ల వద్దనే చికిత్సా సదుపాయాల కల్పనల ద్వారా యీ వ్యాధిని నిర్మూలించాలి. క్షయ చికిత్సా పద్ధతుల్లో ప్రాథమికమయిన మార్పులు వచ్చాయి. అవసరమయిన మందులు, అనుబంధ ఆహార పదార్థాల సరఫరాతో రోగుల ఇండ్ల దగ్గరే చికిత్స చేయటం ద్వారా త్వరలోనే యీ పీడను విరగడ చేసుకో గలగ వచ్చు.

నగరవాసులకు పెనుభూతంగావున్న మరో వ్యాధి కుష్ఠు. బిచ్చగాళ్ల సంఖ్య నానాటికీ పెరగటానికి కూడ ఇదే కారణం. ఆధునిక చికిత్సా పద్ధతుల అవలంబన, కుష్ఠు చికిత్సా కేంద్రాల స్థాపన, ఇతర ఇతోధిక సౌకర్యాల కల్పన ద్వారా యీ వ్యాధిని నాశనం చేయవచ్చు.

ఈ మధ్య కొన్ని సంవత్సరాల నుంచి ప్రసూతి సౌకర్యాల కల్పనలో లోకోపకారులు, స్థానిక సంస్థలు, స్వచ్ఛంద సంస్థలు బాగా చొరవ తీసుకుని ముందుకు వస్తున్నాయి. అయినప్పటికీ, మన దేశంలో శిశు మరణాలు ఇంకా ఎక్కువగానే వున్నాయి. అందుచేత పట్టణాలలో ప్రసూతి కేంద్రాలు, శిశు సంరక్షణ కేంద్రాలు అభివృద్ధి చేయటానికి అవకాశం వున్నది. కుటుంబ నియంత్రణా పద్ధతుల్లోనేమి, పిల్లలను సక్రమంగా పెంచటంలోనేమి శిక్షణ నిచ్చే సౌకర్యాలు ప్రస్తుతం తక్కువగా వున్నాయి. వీర్యం విరుగుడికీ, నిరోధక సాధన సంపత్తి సరఫరాకి తగిన సౌకర్యాలతో కుటుంబ నియంత్రణా కార్యక్రమాన్ని ప్రసూతి, శిశు ఆరోగ్య కార్యక్రమాలతో విలీనం చేయాలి.

నగరాలలో వున్న ప్రజల అవసరాలకు అనుగుణంగా అక్కడి ఆసుపత్రులలో మంచాల సంఖ్యను పెంచాలి. రోజువారీ వచ్చే బయట రోగుల విషయంలో చికిత్సా సౌకర్యాలు చాలా తక్కువగా ఉండటాన వాటినికూడ అభివృద్ధి చేయవలసి వుంది.

## అందరికీ ఉద్యోగాలు

నగరాలలో నిరుద్యోగ సమస్య ఎక్కువగా ఉన్నది. హీనమయిన జీవన ప్రమాణంతో సతమతమవుతున్న క్రింద మధ్య తరగతులలోని అత్యధిక సంఖ్యాకులకు, ముఖ్యంగా మహిళలకు, విద్యాధికులకు పూర్తిగా ఉద్యోగావకాశాలు కల్పించటం ద్వారా వారి పరిస్థితిని చక్కదిద్ద వచ్చు.

వృత్తి విద్యా కేంద్రాలు, స్త్రీల వర్కుషాపులు, సాంఘిక విద్యా కేంద్రాలు, ఇతర విద్యా సంస్థలు, సాయంత్రపు కళాశాలల స్థాపన ద్వారా యీ తరగతి ప్రజలకు ఉద్యోగాలు చూపించ వచ్చు. ఇందువల్ల ముఖ్యమయిన కొన్ని పౌర అవసరాలు కూడ తీరగలవు.

చాల నగరాలలో సినిమాలు కాక, వినోద, సాంస్కృతిక కార్యకలాపాలు లోపించాయి. చక్కని రంగ స్థలాలు (మామూలివి, ఆరు బయలువికూడ), సామాజిక కేంద్రాలు, వినోద కాలక్షేపశాలలు నిర్మించబడవలసిన అవసరంవుంది. అలాగే జాతీయ క్రీడలలో నూతన అధ్యాయాల్ని నెలకొల్పటానికి, యువకులు ఆరోగ్యకరమయిన వాతావరణంలో వృద్ధి చెందటానికి క్రీడాస్థలాలు కూడ నిర్మించబడాలి.

పెక్కు నగరాలలో బాల నేరాలు, నేరాలు, పడుపు వృత్తి, భిక్షాటన రోజు రోజుకూ ఎక్కువవు తు న్నా యి. నగరాల మంచి పేరుకు మచ్చ దెచ్చే యీ చెడుగులను అంతమొందించటానికి శాసన రూపేణా తగిన చర్యను తీసుకోవాలి. తగిన సంక్షేమ చర్యలు కూడ తీసుకొన బడాలి. అన్ని తరగతుల ప్రజలకు ఉపయోగ కరము, ఉత్పాదకరము అయిన వృత్తులు కల్పించ బడాలి. సద్గుణ సంపత్తుల ప్రోదికి వీలుగా పునరావాసం కల్పించ బడాలి. పట్టణ సమాజాభివృద్ధి కార్యక్రమంలో వీటికి ముఖ్య స్థానం ఇవ్వ బడాలి.

చవుక బారు హోటళ్ళు, రెస్టారెంట్లు, సినిమాలు ప్రజల ఆరోగ్యం, నైతిక విలువలు క్షీణించి పోవటానికి హేతువు లవుతున్నాయి. ఇలాంటి నిత్య ప్రజోపయోగ స్థలాల అభివృద్ధికి ఇప్పటి కంటే ఎక్కువ శ్రద్ధ చూపబడాలి.

## సమాజాభివృద్ధి

పట్టణ ప్రాంతాల్ని అభివృద్ధి పరచే ఏ కార్యక్రమానికయినా ప్రజా సహకారం ప్రాతి పదిక కావాలి. పట్టణ సమాజాభివృద్ధి పథకాల తయారీలో, క్రితం కొన్ని సంవత్సరాలుగా పల్లెప్రాంత సమాజాభివృద్ధి ద్వారా గడించిన అనుభవం చాలా సహాయకారి అవుతుంది. ఈ రెండు ప్రాంతాలలోనూ వున్న సమస్యలు, పరిష్కార మార్గాలు భిన్నంగా వుండవచ్చు, కాని ప్రాథమిక దృక్పథం మాత్రం ఒకటిగానే వుండాలి.

రాష్ట్ర ప్రభుత్వాలు, స్థానిక సంస్థలు, స్వ చ్ఛ ం ద సేవా సంఘాల ప్రస్తుత యంత్రాంగాన్ని పూర్తిగా ఉపయోగించుకోవాలి. దానితో పాటు ప్రజలను 50,000 మందిగల చిన్న చిన్న బ్లాకులుగా యేర్పాటు చేసి, వాటి అవసరాలను తీర్చేందుకు అధికార, స్వచ్ఛంద సంస్థలను ఏర్పాటు చేయాలి.

జీతాలపైన, స్వచ్ఛందంగాను పని చేసే కార్య కర్తల వర్గాన్నొక దానిని యేర్పాటు చేసి వారికి తగు శిక్షణ సదుపాయాలు కల్పించేందుకు శ్రద్ధ చూపాలి. ఈ కార్యక్రమం అమలుకు తరిఫీదు పొందిన సిబ్బంది గల సమర్థమయిన యంత్రాంగాన్ని, అదనపు సిబ్బంది కయే వ్యయాన్ని ఎదుర్కొటానికి తగిన వనరులను కనుగోటానికి దీనికి సంబంధించిన పరిపాలన, ఆర్థిక అంశాలను నిపుణులు పరిశీలించవలసి వుంది.

పట్టణ సమాజాభివృద్ధి కార్యక్రమం ద్వారా అన్ని పట్టణాల ప్రజలకు కలిసి వచ్చేలా ఓ పథకం త యా రు చేయాలి. వచ్చే సంవత్సరాన్ని-ద్వితీయ పంచవర్షప్రణాళికలో ఆఖరు యేడు-దేశంలో కొన్ని పైలెట్ ప్రాజెక్టుల (Pilot Projects) అమలుకై ఉపయోగించు కొనటం మంచిది. అక్కడక్కడ కొన్ని పురపాలక సంఘాలు యిట్టి పైలెట్ ప్రాజెక్టుల అమలుకు నాంది వేశాయి. ఫోర్డు సంస్థ సహాయ సహకారాలతో ఢిల్లీ పురపాలక సంఘం యీ రంగంలో అద్వితీయమైన కృషి చేసింది. ఢిల్లీ కార్పొరేషను పైలెట్ ప్రాజెక్టులో జరిగిన కృషి ఇతర ప్రా ం తా ల్లో కూడ అట్టి స్వయం సహాయ ప్రాజెక్టుల అవతరణకు దారి తీసి యీ కార్యక్రమానికి పౌర సహకారాన్ని సాధించ వచ్చు. అన్ని పైలెట్ ప్రాజెక్టుల అనుభవాన్ని మేళవించి పట్టణ సమాజాభివృద్ధికై మార్పులకు అవకాశంగల ఒకే రకమయిన పద్ధతిని రూపొందించు కోవాలి.

పట్టణ ప్రాంత ప్రజలను కొన్ని యూనిట్లుగా విభజించాలి, ఒక్కొక్క యూనిట్‌లో 50,000 వుండ వచ్చు. ఈ కార్యక్రమం క్రిందకు తేవలసిన ఆరు కోట్ల మందికి దేశం మొత్తంమీద ఇలాంటి యూనిట్లు 1200 యేర్పాటుకావలసి ఉంటుంది. తృతీయ పంచవర్షప్రణాళికలోనే యీ కార్యక్రమాన్ని ముగించ టానికి యేడాదికి 240 యూనిట్లు నిర్మించ బడాలి,

స్వచ్ఛంద సంస్థల సహకారంతో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు, స్థానిక సంస్థలు దీనిని సాధించవచ్చు. క్షయ, కుష్ఠు వ్యాధుల చికిత్స విషయంలో గృహ చికిత్సా సదుపాయాలతో రోజు వారీ రోగులకు ఔషధ శాలల యేర్పాటు, మంచి నీటి కుళాయిలు, స్నానాల గదులు, మరుగు దొడ్లు మున్నగు వాటి యేర్పాటులకు ఒక్కో యూనిట్‌కు సుమారు ఒక లక్ష రూపాయలు కేటాయించ వచ్చు.

జీతంపై పనిచేసే అదనపు ఉద్యోగులు, సంఘ సేవకుల జీత భత్యాలకు, కార్య కర్తల శిక్షణకు, ఔషధ శాలలకు, చేతి పనుల శిబిరాలకు కావలసిన సామగ్రివంటి ప్రాథమికావసరాలకు అయ్యే అదనపు ఖర్చులకు సంవత్సరానికి 50,000 రూపాయలు అవసరం కావచ్చు. ఒక్కొక్క యూనిట్‌కు కేటాయించే మొత్తం—ప్రణాళికలో మొదటి సంవత్సరం ప్రారంభించిన దానికి 3.5 లక్షలు, చివరి యేడు ప్రారంభించిన వాటికి 1.5 లక్షల రూపాయల చొప్పున కేటాయించ బడుతుంది-సగటున 2.5 లక్షలుగా తేలుతుంది. దీనిని బట్టి చూస్తే, 1200 యూనిట్లకు కావలసిన మొత్తం 30 కోట్ల రూపాయలు. అంటే, దేశాని కంతకూ ప్రణాళికా కాలంలో సంవత్సరానికి ఆరు కోట్ల రూపాయలు కావాలన్న మాట. దీనినంతనూ గృహ వసతి, మురికి పేటల నిర్మూలన, నీటి సరఫరా, మురుగు పారుదల సౌకర్యాలకు ప్రణాళికలో ఇదివరకే కేటాయించిన మొత్తంగాక ఆదనంగా యేర్పాటు చేయవలసి వుంటుంది.

—:*:—

విశ్వాస మంటే నిశ్చితమయిన ఆశతో, నమ్మకంతో మర్యాదాకరమయిన గొప్ప పనులకు పూనుకొనే మానసిక స్థితి.

— సిసిరో

* * *

స్వతంత్రులయిన మానవులకు ఓటు నచ్చినట్టు తుపాకి గుండు నచ్చదు........ అలా యెవరికేనా అది నచ్చితే వారు ఓడిపోయి అందుకు మూల్యం చెల్లించుకుంటారు.

— లింకన్

* * *

స్నేహితునికి నీడ నిచ్చే యింటి ఆనందమే ఆనందం.

— ఎమర్సన్

# "నాన్యః పంథా….!"

—"లసూనా"

ఒక వంక గగనాగ్ర మొగిదాకు సౌధమ్ము
లొక వంక తరుమూల మొక నివాస
మొక వంక మృష్టాన్న మొలికించు పులి త్రేపు
లొక వంక తనియార వొకని ప్రేవు
లొక వంక నణుమార ణోద్వేగ విన్నాణె
మొక వంక నాంగుళ్య మొనరముద్ర
ఒక వంక రణభేరు లొనరించు నినదమ్ము
లొక వంక శాంతి గీతో దయమ్ము
లొకటి కెదురుగ నొకటియు వికట మౌట
నకట బెదరక నొకటియె యొక్క మాట
తెలుప దలచిన, తలపుల వలపు టలత
నలువ, పలుకుల చెలికల కెలికె, తులువ !

* * *

వసివాడె సామ్రాజ్య వాదమ్ము లిలపైని
యినబింబ మునుగాంచనిరుల మాడ్కి,
జనియించె ధరపైనిజన సామ్య తత్త్వమ్ము
లెన లేని పడుగింజ వెదుగు పోల్కి,
కరుడు గట్టిన చోట గాంధేయ సిద్ధాంత
మరయంగ నంధున కద్దమట్లు,
కరతలా మలకంబు కమ్యూ నిజం బెందు
కసిదీర మసిబూయు క్ధన మట్లు,
వెతుక లేకను, వాదమ్ములతుకరాక,
నెదన కుదురుగ నరయంగ నెదియొ తోచె !
మనసు మనసును ప్రేమించు మానవత్వ
మనషు ! వాదము, నాదమ్ము నగును గాత !

అణు మర్మముల వేట లర్ధాంశ ముడిగిన
నన్నార్తు లెటనంచు నరయ వలయు,

హంస తూలికలంద సత్యాశ లడగిన
నర్ధనగ్న శరీరు నరయ వలయు,
విజ్ఞాన వారాశి వీసమందిన జాలు
నజ్ఞాన మెటనంచు నరయ వలయు,
ఈసు దోస మటంచు నిసుమంత వినవాడఁ
నరు లెవ్వరని నేల నరయ వలయు,

వదల కున్నను, వదలించ కదలకున్న,
నదను దప్పిన, నెదనుంచి ముదములన్ని
చెదరి, బెదరగ నదలించు నెదియొ-లీల!
యెదర పదరక విదలించుటదియ మేలు!

* *

మాన్యులు వేదికల్ విరుగు
మాటలతో స్తుతియించుచున్న సా
మాన్య మనీషి నిత్యమిల
గ్రుమ్గిన నెయ్యుత శాంతి దాంతు! లీ
వన్య మృగ ప్రపూర్ణ జన
వాటిక నొక్కట రెచ్చిపోవు పెన్
దైన్యత రూపు రూపనగు
ధర్మ మెరుంగని మార్గ మెట్టి దో!

———

శ్రేష్ఠుడైన వ్యక్తి జీవిత సౌలభ్యం గొప్పది. ధర్మనిరతి వల్ల ఆందోళనలు, వివేకం వల్ల చిక్కులు, ధైర్యం వల్ల భయం అతనికి సుదూరంగా ఉంటాయి.

— కన్ఫ్యూషియస్.

కథానిక:

# ఉచిత బహూమానాలు

– శ్రీ పెచ్చెట్టి వెంకటేశ్వరరావు

ఇంట్లో పనులన్నీ పూర్తి చేసుకొని, రెండు గంటలకు శారద వాకిట్లోకి వొచ్చింది. అప్పటికే చుట్టు పక్కల వాటాల అమ్మలక్కలంతా అక్కడకు చేరారు. తనూ వాళ్ళతోబాటే చతికిలబడింది లోకాభిరామాయణానికి.

ఇళ్ళలో చేసుకొన్న పప్పూ, పులుసుల దగ్గర్నుండీ, పొరిసీ చర్యల వరకూ వాళ్ళ సమావేశాల్లో దొర్లాయి.

కొంతసేపటికి ఎవళ్ళో చదువుకున్న స్త్రీ లిద్దరు అక్కడకు వొచ్చారు, గేటులోంచి.

"ఏం? ఎవరు కావాలండి?" అంది శారద విచిత్రంగా చూస్తూ.

"మీకోసమే."

"నా కోసమా? ఏం పని?"

"అంతా చెబుతాముండండి!"

వాళ్ళు చాప మీద చతికిలపడ్డారు. వాళ్ళతో వొచ్చిన ఒక కూలి పెట్టెను నెత్తి మీంచి దింపుతున్నాడు.

ఆ అగంతకురాళ్ళలో ఒకావిడ ఆ పెట్టెని తెరచి అందులో నించి ఒక సబ్బుని తీసింది.

"ఇదిగో నండి"

"ఎందుకండి, మాకిప్పుడు సబ్బులు అవసరం లేదు"

"ఫరవా లేదు! ఉంచండి! ఇది కొత్త రకం సబ్బు. దీన్ని దేశంలో ప్రచారం చెయ్యడం కోసం కొన్ని కుటుంబాల వారికి ఉచితంగా బహూకరిస్తున్నాం. వాడి చూడండి. తర్వాత మీ అభిప్రాయాలు తెల్సుకోడానికి వొస్తాం"

'ఉచితం' అనేటప్పటికి ఎవళ్ళకి వాళ్ళే దాన్ని కాజెయ్యాలనుకున్నారు. కాని లోపల అనుమానం! ఎవరూ ధైర్యం చెయ్యలేక పోయారు. చివరికి శారదే దాన్ని తీసుకుంది.

*   *   *

"వాళ్ళెవళ్ళో ఆడాళ్లు వచ్చి ఈ వేళ ఉచితంగా సబ్బులు పంచిపెట్టారు." అంది శారద భర్తతో రాత్రి భోజనాల వేళ.

"ఎవరు వాళ్లు?" అన్నాడు హరిబాబు. అతను తహసీల్ లో గుమాస్తాగిరీ వెలిగిస్తున్న పెద్దమనిషి.

"ఏమో?"

"ఉచితంగా ఎందుకిస్తారు?– ఏమన్నా తెలివి తక్కువ వాళ్ళా? డబ్బు ఎక్కువుందా?"

"నిజంగానే ఇచ్చారు–ఏదో–ప్రచారంకోసమట!"

"ఏ కంపెనీ వాళ్లు?"

"తెలీదు; ఏదో కార్డొకటిచ్చారు—హిందీది"

"ఏది సబ్బు చూడనీ?"

శారద వెళ్ళి సబ్బు తెచ్చింది. ఆయనికీ ఏం తెలీలేదు. తెల్లగా వుంది. దాని మీద ఏమీ రాసి లేదు. ఎంత వెదికినా దాని మీద ఒక్క అక్షరం ముక్కయినా కనబడలేదు.

ఈ రోజుల్లో ప్రచారక సాధనాలూ, విధానాలూ, ఎన్నో రకాలు! చివరి వరకు అది ప్రచార సాధనమనే తెలీదు. సినిమా న్యూస్ రీల్సులో తాను చాలా సార్లు మోసపోయాడు కూడా!

"ఇదేం సబ్బో అడిగావా? బట్టల సబ్బా? వొంటి సబ్బా? ఏమిటో?"

"లేదు"

"అయితే ఇది వాడకు. ఎందుకైనా మంచిది. ఏ ప్రమాదం వస్తుందో? వొళ్ళు పొక్కితే డాక్టర్ల వెనకాల తిరగాలి"

శారద దాన్ని తీసుకుపోయి పదిలంగా పందిరి మంచం క్రింద పెట్టెలో భద్రంగా పెట్టింది.

*   *   *

నెలలో ఆఖరి వారం. పెనల్టిమేట్ సాటర్‌డే అవడం వల్ల అతనికి సెలవు ఇచ్చారు.

వంటయింటని శారద మూడు వార్నింగులు ఇచ్చాక లేచి కాలకృత్యాలు తీర్చుకొని, గెడ్డం గీసుకొని, సైకిల్ తుడచి, బూట్లు పాలిష్ చేసుకుని, ఇంట్లో ఉతికిన బుష్‌కోటును చెంబు ఇస్త్రీ చేసి స్నానానికి లేచాడు హరిబాబు.

బాత్‌రూమ్‌లో సబ్బు లేదు.

"సబ్బేదీ?"

"ఐపోయింది. అందుకే నిన్ననే మీకు మనవి చేశాను. మీరు మర్చిపోయారు"

"ఏడ్చినట్లే వుంది! ఇప్పుడేం చెయ్యమంటావ్?"

"కుంకుడుకాయలు .... "

"చట్"

"పోనీ షీకాయ పొడుం ఇవ్వనా?"

"ఉహుఁ!"

"సున్ని పిండి వాడండి!"

"నాన్సెన్సు—ఇంకా పసుపు కూడా కలుపుతాననలేదు నయం"

"అయితే నన్నేం చెయ్యమంటారు?"

కాసేపు ఆలోచించింది.

"పోనీ ఆ మధ్య వాళ్ళెవరో ఇచ్చిన శాంపిల్ సబ్బు ఇవ్వనా?"

"ఏమో అదేం సబ్బో? .... ఏదో ఒకటి తగులడు; లేని బావ కంటే గుడ్డి బావ.... అన్నట్టు"

శారద సబ్బు తెచ్చి యిచ్చింది. అతను నాలుగైదుసార్లు వాసన చూశాడు. కళ్ళు సాధ్యమైనంత పెద్దవి చేసుకుని చూశాడు. చివరికి గొణుక్కొంటూ నీళ్ళు పోసుకున్నాడు.

బట్టలు మార్చుకొని అద్దం దగ్గరకు వచ్చి తల దువ్వుకో సాగాడు. వొళ్ళంతా ఘుమఘుమ వాసనల్తో నిండివుంది. బట్టలు మార్చుకున్న సమయానికి భార్యామణి శారద వెచ్చని సెకండ్‌డోస్ కాఫీతో సిద్ధమైంది. దాన్నందుకుని ఆత్రంగా కాఫీకోసం మొహం వాచిన వాడిలా తాగసాగేడు. అతను రోజుకు 6 సార్లన్నా తాగుతాడు. ఐనా అదేం మహత్యమో ముందో వెధవ కాఫీలో అస్తమానం కొత్తగానూ, రుచి కరంగానూ వుంటుంది.

"ఎలా వుంది సబ్బు?"

"చాలా బాగుంది!"

"మీరు మొదట భయపడ్డారుగా?"

"రోజులు బాగో లేవుగా! అందుకని"

"మీకు ఏదన్నా అనుమానమే లెద్దురూ?" అంది శారద సాగదీసుకుంటూ.

*   *   *

రెండు నెల్ల తర్వాత. అది నెలలో మొదటి వారం. హరిబాబు చేతిలో జీతం రాళ్లు ఇంకా కొంచెం కదులుతున్న రోజులు.

ఒకనాడు పోస్ట్‌మేన్ అతని ఆఫీసులో ప్రత్యక్షమయ్యాడు.

"మిస్టర్ పి. హరిబాబు, పేష్కార్, తహసిల్—మీరేనాండి?"

"అవును"

"మీపేరొక వి. పి. పి. వుంది!"

"నాకెందు కొస్తుందయ్యా — నువ్వు పొరపడుతున్నావేమో?"

అతను పార్సెల్ చూపాడు. ఎడ్రసంతా తనదే. కాని లోపలేముందో తెలీదు. ఏదో కలకత్తా కంపెనీ నుండి వొచ్చినట్టుంది.

"ఎంత?"

"6-12 0"

అతనో క్షణం ఆలోచించాడు. ఎవరన్నా తనని మోసం చెయ్యాలని పంపించారేమో ననుకున్నాడు,

చివరికి తెగించి పార్సిల్ తీసుకున్నాడు, ఆరుం ముప్పావలా తనది కాదనుకొని.

పార్సెలు విప్పగానే అతనికి చిర్రెత్తుకు వొచ్చింది.

ఇంట్లో అడుగు పెట్టే క్షణం కోసం ఎదురు చూశాడు. గుమ్మంలో అడుగు పెట్టగానే—,

''శారదా, శారదా!'' అని అరిచాడు.

కాఫీ గాస్తున్న శారద వయ్యారంగా వొచ్చింది, చేతులు తుడుచుకుంటూ.

"మళ్ళా ఆ సబ్బుల వాళ్ళొచ్చారా?''

"ఆఁ. ఆ మధ్యొచ్చి అభిప్రాయం అడిగి మీ ఎడ్రస్ తీసుకెళ్ళారు."

"ఇదుగో, ఆ ఉచిత బహుమానాల పర్యవసానం'' అంటూ అంతవరకూ వెనక దాచిన డజను సబ్బుల్ని శారద మొహం ముందు పడేశాడు;''ఆరుంముప్పావలా ఆముదం''

శారద చకితనేత్రయై విచిత్రంగా చూడసాగింది!



మానవ జాతిని పట్టి పీడించే పెనుభూతం స్వార్థమే.

— గాడ్‌స్టన్

* * *

మనం ముందుకు సాగుతూనే ఉండాలి, లేకపోతే మన భూమికు విరుద్ధంగా కాలమే మనని ముందుకు తోస్తుంది.

— శ్రీ అరవిందులు

* *

మనస్సుతో, అంతఃకరణతో యెదుటి వారి శ్రేయస్సును కోరాలి— అదే మనం యితరులకు చేయగల ఉత్తమ సహాయం.

— శ్రీ అరవిందులు

# వదాన్యుడు

“ధనికులు పేదవారి అభివృద్ధి నిమిత్తం ఉదారంగా విరాళాలు ఇవ్వాలి. దేశంలో నేడు యిది ప్రధానావసరం. వదాన్యుడయిన శ్రీ వై. శివరామిరెడ్డిని అభినందించటానికి నాకు యెంతో ఆనందంగా ఉన్నది” అని మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. సంజీవరెడ్డి అనంతపురం జిల్లా కొనకొండ్ల ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని దర్శించినప్పుడు అన్నారు.

శ్రీ శివరామిరెడ్డి కొనకొండ్లలో ధనికుడు. అభ్యుదయ రైతు. ప్రణాళిక క్రింద జరిగే అభివృద్ధి కార్యకలాపాలను ఆయన యెంతో మెచ్చుకొనేవారు. “ప్రజలు ముందు తమ జీవన ప్రమాణాన్ని అభివృద్ధి పరుచుకుందికి ముందుకు రావాలి. అటుపిమ్మట ప్రభుత్వ సహాయాన్ని అపేక్షించాలి. సమాజాభివృద్ధి కార్యక్రమాల సారం యిదే.” అని శ్రీ రెడ్డి అంటూ ఉండేవారు. ఉన్నట్టుండి ఒక రోజున అనంతపురం జిల్లా ప్రణాళికల అధికారిని కలుసుకొని ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికయ్యే ఖర్చునంతనూ తాను భరిస్తాననీ, ఆ కేంద్రాన్ని తమ గ్రామంలో నెలకొల్పమనీ కోరారు.

ఆ ప్రకారం ఆయన రూ. 25,000 లకు పైగా ఖర్చు పెట్టారు. ఇదికాక, కేంద్రం నెలకొల్పడానికి $3\frac{1}{2}$ ఎకరాల స్థలం యిచ్చారు. భవనం నిర్మాణం దాదాపు పూర్తిఅయింది. ఆయన నిరంతర కృషి ఫలితంగా గ్రామంలో వేళ్లు పారు కొని పోయిన విభేదాలు సమసిపోయినవి. పెద్దరకం పంచాయతీకి యిటీవల జరిగిన ఎన్నికలు పోటీ లేకుండా జరిగాయి.

ఈ కేంద్రాన్ని దర్శించిన పెక్కుమంది అధికార, అనధికారులే కాక కేంద్ర ప్రభుత్వ ప్రణాళికల శాఖా కార్యదర్శి శ్రీ ఎస్.ఆర్. టాండన్, ఐ.సి.ఎస్., కూడా భూరి విరాళాలు ఇచ్చిన శ్రీ రెడ్డిని ప్రశంసించారు.

తోటివారి సంక్షేమానికి జీవితాన్ని అంకితం చేసిన శ్రీ శివరామిరెడ్డి 28-6-59 న స్వర్గస్థులయారు. ఇది విచారకరం.



భయంవల్ల మనిషి ప్రమాదంలో చిక్కుకోక పోవచ్చు, కాని ప్రమాదంలో ఉన్నప్పుడు కాపాడేది మాత్రం ధైర్యమే.

— సామెత.



రిపబ్లిక్ దినోత్సవం నాడు సికింద్రాబాద్ పెరేడు మైదానంలో జరిగిన విన్యాస సందర్భంలో ఆంధ్రప్రదేశ్ గవర్నర్ వందన స్వీకారం చేస్తున్నారు.



19-12-59న హైదరాబాదు వైమానికదళ కేంద్రంలో పైలెట్లు, నావిగేటర్ల, కోర్సు పట్ట ప్రదానోత్సవం సందర్భంలో జరిగిన మార్చి పాస్టులో వందన స్వీకారం చేస్తున్న రాష్ట్ర గవర్నరు.



రిపబ్లిక్ దినోత్సవ విన్యాస సందర్భాన ప్రెసిడెంటు పోలీసు మరియు ఫైర్ సర్వీసెస్ పతకములు స్వీకరించిన వారు: (ఎడమనుండి కుడికి) 1. శ్రీ సి. దుర్గారావు. 2. శ్రీ మహమ్మద్ బదియుద్దీన్, 3. శ్రీ వి. శోభనాద్రి నాయుడు. 4. శ్రీ బి.ఎన్. కళ్యాణరావు-మధ్యలో ఇన్స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీసు శ్రీ ఎ.కె.కె. నంబియారు కూర్చున్నారు-తర్వాత 5. శ్రీ యమ్. కృష్ణమూర్తి. 6 శ్రీ ఇ. వెంకటపతిరావు నాయుడు. 7. శ్రీ వి.డి. కోటేశ్వర రావు. 8. లాన్స్ నాయక్ శ్రీ జంగ్లీరామ్.



విన్యాస దృశ్యం




బెంగుళూరు ప్రదర్శనలో ఆంధ్రప్రదేశ్ ప్రదర్శనశాల-1960 జనవరిలో భారత జాతీయ కాంగ్రెసు మహాసభ సందర్భంలో బెంగుళూరులో ప్రదర్శన యేర్పాటు చేయబడింది.



ఆంధ్రప్రదేశ్ ప్రదర్శనశాల మరొక దృశ్యం.



ప్రణాళికలు, సమాచారశాఖా మంత్రి శ్రీ పి. రంగారెడ్డి 21-1-60 న హైదరాబాదులో అఖిల భారత పారిశ్రామిక ప్రదర్శనలో సమాచార, పౌర సంబంధాల శాఖ ప్రదర్శనశాలను తిలకిస్తున్న దృశ్యం.



పురోహితుని ఆందోళన—గృహ ప్రవేశం నాటకంలో ఒక దృశ్యం. రాష్ట్ర సమాచార, పౌర సంబంధాల శాఖ డైరెక్టరు యేర్పాటు చేసిన సాంస్కృతిక కార్యక్రమాలలో మొట్టమొదటి అంశంగా యిది. పద్మశ్రీ స్థానం నరసింహారావు దర్శకత్వాన 21-1-60 న హైదరాబాదు ఎగ్జిబిషన్ థియేటరులో ప్రదర్శింపబడింది.



కీ॥శే॥ వై. శివరామిరెడ్డి (పుట: 20 చూడుడు)



అనంతపురం జిల్లా కొనకన్ల ప్రాథమిక ఆరోగ్య కేంద్రం దృశ్యం (పుట: 20 చూడుడు)

తోలు బొమ్మలు: కథానాయిక; బొమ్మ చేతిని ఆడించే పద్ధతి యిందులో చూడవచ్చు.

(పుట: 42 చూడుడు)





చేనేత పరిశ్రమలో నిమగ్నులైన పనివారు (పుట: 6 చూడుడు)

# వైమానికుల శిక్షణ

క్రడచిన డిసెంబరు 19వ తేదీన హైదరాబాదులోని వైమానిక దళ కేంద్రంలో, 75 వ. పైలట్ల కోర్సుకి, 16వ నావిగేటర్ల కోర్సుకి పట్టప్రదానం జరిగింది. ఈ కోర్సులను తీసుకొన్న అధికార్లకు వైమానిక (ఫ్లయింగ్) "అధికార పత్రాలు" (బ్రెవెట్సు) యివ్వబడినవి. దీనితో వారు భారతీయ వైమానిక దళంలో వైమానికులుగా పనిచేయటానికి అర్హత సంపాదించారు.

భా.వై.ద. శిక్షణా ప్రమాణాలు శ్రేష్ఠమయినవి. అవి ప్రపంచంలోని ఏ వైమానిక దళ శిక్షణా ప్రమాణాలకు తీసిపోవు. పట్టాలను పొందిన అధికార్లు ఎట్టి శిక్షణను పొందారో, ఏ ప్రమాణాన్ని సాధించారో తెలుసుకుందాం.

## 75వ పైలట్ల కోర్సు

ఈ అధికార్లు రెండు సంవత్సరాల పాటు విస్తృతమైన శిక్షణను పొందారు. తొలి సంవత్సరం శిక్షణ జోధపురంలోని వైమానిక దళ (ఫ్లయింగ్) కళాశాలలో జరిగింది. ఇక్కడ వారు భారత దేశంలో తయారయిన హెచ్.టి. 2 ప్రాతిపదిక విమానాన్ని, ఆ పై మెట్టు విమానం టి.అ.జి.ని నడపడం నేర్చుకున్నారు. హైదరాబాదులో, చివరికి వారు నడిపే రకం విమానాలను అనగా-రవాణా పైలెట్లు డకోటా, జెట్ పైలెట్లు వాంపైర్ విమానం-నడపటం నేర్చుకున్నారు.

హైదరాబాదులో వారి శిక్షణ రెండు ఘట్టాలలో జరిగింది-మొదటి ఘట్టంలో అన్ని పరిస్థితులలోను విమానాన్ని నడపటము, రెండవ ఘట్టంలో ఆ నడుపుటను ఆచరణ అవసరాలకు వర్తింపచేయుటము. రవాణా పైలెట్లు ఎక్కువ దూరంగా ఏ స్థలానికయినా వాతావరణం అన్ని పరిస్థితులలోను రాత్రింబగళ్లు విమానాలను నడపటం నేర్చుకున్నారు. ఆ పైన వారు పై నుంచి సరుకులను వదలటం బాగా నేర్చుకున్నారు. ఇది నేల దళాల పోషణకు, శాంతి కాలంలో ప్రకృతిసిద్ధమయిన ప్రమాదాలు సంభవించినప్పుడు చాల అవసరం ఇది అందరికీ తెలిసినదే.

జెట్ పైలెట్లకు జెట్ యుద్ధ విమానాలలో పనిచేయటానికి తగినట్లుగా శిక్షణ యివ్వబడింది. అన్ని పరిస్థితులలోను తమ విమానాలను నిలబెట్టుకొనటం వారు బాగా నేర్చుకున్నారు. ఆ పైన విమానంలో ఉండి యెదిరి విమానాలపై తుపాకులు పేల్చటం, క్రిందనుంచి వచ్చే దెబ్బలను రాకెట్లు వగైరాలతో కాసుకొనటం మున్నగు విద్యలను నేర్చుకున్నారు.

వైమానికదళాధికారులతో పాటు కొందరు నేవీ ఆఫీసర్లు కూడా 75 వ. పైలెట్లకోర్సుతో వైమానికశిక్షణను పూర్తిగా పొందారు.

## 16 వ నావిగేటర్ల కోర్సు

ఈ అధికార్లు 18 నెలలపాటు నావిగేటర్ల శిక్షణను పొందారు. మొదటి 12 నెలలు పైన చెప్పిన జోధపురం కళాశాలలోను, మిగిలిన 6 నెలలు హైదరాబాదులోను శిక్షణ పొందారు. హైదరాబాదులో వారికి రవాణా పైలెట్ శిక్షితులతో పాటు శిక్షణ యివ్వబడింది. వారు అన్ని పరిస్థితులలోను ప్రపంచంలోని ఏ ప్రాంతానికయినా విమానాలను నావిగేట్ చేయగలరు. అంతేకాక సరిగా కనపడని పరిస్థితులలో విమానం నేలకు దిగేటప్పుడు వారు విమాన చోదకునికి నేత్రాలుగా పనిచేస్తారు. ఆధునిక యుద్ధ విమానాలకు అవసరమయిన వివిధ రేడియో, రాడార్ ఉపకరణాల వాడకంలో వారు సమర్థులు. ఈ అధికార్లు భారతీయ వైమానిక దళ రవాణా, బాంబర్, రాత్రి యుద్ధ విమానాలలో పని చేయటానికి సంసిద్ధులై ఉన్నారు.

విస్తృతమయిన యీ వైమానిక శిక్షణ అంతా ఒక నిర్ణీత కార్యక్రమాన్ని అనుసరించి, కచ్చితమయిన ఉన్నత

ప్రమాణాలకు అనుగుణంగా జరిగింది. నిరంతర అప్ర మత్తత ధర్మమా అని తీవ్రమయిన ఆపదలేమీ సంభవించ లేదు.

## నేల శిక్షణ

వైమానిక శిక్షణతో పాటు వారికి వాయు ప్రయాణ సంబంధమయిన నేల శిక్షణకూడా యివ్వబడింది. నాయకునకు అవసరమయిన, విస్తృతమయిన సాధారణవిషయపరిజ్ఞానాన్ని కలుగజేసే శిక్షణకూడా యివ్వబడింది. ఇందు నిమిత్తం, యీ అధికార్లు కళా సంబంధమైన వివిధ విషయాలను నేర్చుకున్నారు. ప్రస్తుత వ్యవహారాలపై జరిగే చర్చలు మున్నగు వాటిలో పాల్గొన్నారు. వారి ఉద్యోగ ధర్మానికి మంచి దేహదార్ఢ్యం అవసరం కాబట్టి శిక్షణలో యీ విషయానికి కూడా తగినంత ప్రాధాన్యత యివ్వబడింది.



నిజమయిన స్నేహితుడు మనసు విప్పి మాట్లాడతాడు, సరయిన సలహా చెబుతాడు, ముందు వెనకలు చూడకుండా తోడ్పడతాడు, సాహసంతో పనిచేస్తాడు, అన్నీ ఓర్మితో సహిస్తాడు, ధైర్యంగా సమర్థిస్తాడు. విడవకుండా మైత్రి నెరపుతాడు.

— విల్లియంపేన్.

* * *

దేశం కోసం కలిసి పనిచేయటంలో పొందే ఆనంద పునఃప్రాప్తి నిజానికి జీవిత పునఃప్రాప్తే. అది సమాజ సత్వాన్ని పునరుద్ధరించే ప్రాజెక్టు. అది గ్రామ కల్యాణం. లక్ష్మీ వ్రతం.

— సి. రాజగోపాలాచారి.

నాటిక

# కలిసి బ్రతుకుదాం

— శ్రీ రెడ్డి చిన వెంకటరెడ్డి

(2 వ రంగము)

(గత సంచిక తరువాయి)

బుర్రకథ

కథకుడు:- ఈ విధంగా

ప్రజా బలానికి తోడు ప్రభుత్వం బాసటయైనాదీ — తందాన తాన
కట్టిరి స్కూలు కుటీర పరిశ్రమల, కేంద్ర మొక్కటండీ ,, ,,
చిరు నవ్వులు ప్రజమోముల పైన చిందులాడినావీ ,, ,,
ఐక్యమే అభివృద్ధికి మూలమ్మని అందరు తలచారు ,, ,,

వచనము:- ఈ పరిస్థితిని చూచిన చంద్రం
భళానోయి భాయి తమ్ముడా! మేల్ భళానోయి దాదానా!
తోక త్రొక్కినా త్రాచులా
బుసబుసకొట్ట సాగాడురా
కాటు వేయ, సమయానికై
కాటువేయ సమయానికై కనిపెట్టుక కాపుండెరా! — భళానోయి....

—(తెర పడి లేచే వరకు...... కోటయ్య, చంద్రం మాట్లాడు కుంటూ ప్రవేశిస్తారు)—

కోట:- అది సరెగనుండీ, ఇంతెల్లెమే ఊరంత ఇట్ల మారి పోతుందని అనుకోలేదు, నేను, అప్పుడు ఆ కాగితం శంకరమయ్యగారి తల్లితాన రాపిచ్చుకున్నప్పుడె జబర్దస్తిగ రాయించుకోనుంటిరి.

చంద్రం:- ఇలా జరుగుతుందని నాకేం తెలుసు? తెలుసుంటే ఏమి చెయ్యాలో అదే చేసే వాణ్ణి.

కోట:- ఇప్పటికైనా మించిపోయిన దేముండది. ఏదన్న ఒక కిటుకు ఆలోచించురి.మీరు తల్సుకుంటె ఏదో ఒక దారి దొరకక పోతాది.

చంద్రం:- అలాంటి అవకాశం ఏం లేదు కోటయ్యా! అప్పుడేదో మామూలు కాగితం వ్రాయించుకున్నాను. అది ఇప్పుడు దేనికీ పనికి వచ్చేట్టు కనపట్టం లేదు. ఆ స్కూలు, దవాఖానా, కుటీర పరిశ్రమలకని కట్టిన ఆ యిల్లు-ఆ భూమంతా విడదీసి అమ్మితే, ఐదువేల రూపాయలు వచ్చేవి.

కోట:- రావుండి మరి, బేసుగ వస్తయ్. మర్సే పోయిన, దాని పక్క జాగ అంతా హరిజనులకు ఇండ్లు కట్టు కొమ్మని దానం యిచ్చిందంట గద శంకరమయ్య.

చం|ద్రం:- యిచ్చాడూ! వీడేం కష్టం చేసి సంపాదిస్తేగా, తాత ముత్తాతలు సంపాదించి, తేరగా పెడ్తే నేనూ యిస్తాను.

కోట:- బాగన్నరూ, మీ తాత ముత్తాతలు సంపాయించింది పావలా వంతైతే, మీరు సంపాయించింది రూపాయ వంతాయె.

చం|ద్రం:- అదీ సంగతి. కష్టపడి సంపాదిస్తే గాని తెలియదు ఎవడికైనా! ఆస్తిని సంపాదించడమంటే మాటలా!

కోట:- ఎన్ని కిటుకులు బెట్టాలె, ఎంత యవ్వారం ఎరికుండాలె. అది అందరితోని అయ్యేపని కాదులెరి. ఆఁ ఏవుండీ అడుగుదామని మర్చే పొయినా, ఆ తూర్పు గుడ్డెం సెల్కె ఇస్తనంటిరి, పనిలె పని, ఒక కాగితం ముక్క రాసి పడెయ్యిరి నా మీద.

చం|ద్రం:- ఏవిఁటీ? నీకా చలక యివ్వాలా? నీవల్ల నాకు పదివేల రూపాయలు నష్టం వచ్చింది. దానికి నువ్వేం యిచ్చుకుంటావో మొదట చెప్పు.

కోట:- ఇదెక్కడి కత. నేనేం చేస్తినుండి.

చం|దం:- ఏం చెయ్య లేదేం పాపం, ఆ రోజున శంకరంగాడి మీద పోలీసులకు రిపోర్టు చేస్తే, ఇంతవరకు వాడు జైల్లో వుండే వాడు, వాడొచ్చే వరకే మనం యీ వున్న భూమి అమ్ముకునే వాళ్లం. అది చెడగొట్టింది నువ్వు కాదూ?

కోట:- కని, ఇంత జేసింది నేనే నంటర? అట జూసుకుంటె చేసిందంత కమలమ్మ గోరే. మీ మాటలేమి సెవినేసుకోక, పూర్తిగ శంకరమయ్య తోనె తిరుగుతుండె. ఆమె వచ్చినప్పటి సందె కాదుండి, ఈ వూరంత యిట్లయింది.

చం|ద్రం:- ఆ మాట నిజమే కోటయ్యా! అబాధ్యతంతా పూర్తిగా కమలదే అనను. అయినా అన్ని విధాలా చెప్పి చూచాను. ఏమైనా అంటే ఆడపిల్ల, వుసూరుమంటుందేమో నని వూరుకుంటున్నాను. మహాఁ వుంటే యింకో నెలో, రెండు నెల్లో వుంటుంది. తరువాత ఎలాగో వెళ్లిపోతుందిగా. ఈ మాత్రానికి అన్నయ్యతో గూడా మాట తెచ్చుకోవడం నాకిష్టం లేక వూరుకుంటున్నాను.

కోట:- మీరిట్ల అనుకుంట కూసుంటె ఈ రెండు నెలల్ల ఇటు వూర్ని అటు, అటు వూర్ని ఇటు చేసి పోదుండి.

చం|ద్రం:- ఆ శంకరంగాడు ఉన్నాడే! వాడే దీన్ని ఇలా చేశాడు. ఏది ఏమైన మనం జాగ్రత్తగా వుండాలి కోటయ్యా,

కోట:- అదేలేరి, అసలు శంకరమయ్య, కమలమ్మ గోరు పట్నంల గలసి సదివిం|డంట గద.

చం|ద్రం:- ఆ స్నేహమే ఇంతవరకూ తెచ్చింది.

కోట:- ఇంతటితోనె పోద్దనుకుంటన్నారు. పెండ్లి కూడ చేసుకుంటరని పుకారు గుంది ఊళ్లె.

చం|ద్ర:- ఏమిటేమిటీ అంత వరకూ వచ్చిందీ వ్యవహారం నేను బ్రతికుండగా అలా జరిగేందుకు వీల్లేదు. వాడు నాకు శత్రు పక్షం వాడు, శత్రువూ.

కోట:- మీరట్టనె అంటరు గని, కమలమ్మగోరు గట్టిగ ఆయన్నె సేసుకుంట నంటె, మీరు సప్పుడు కాకుండ ఊకోరుండి. అహాఁ మనలో మాట చెప్పిరీ?

చం|ద:- అవును కోటయ్యా! దాని మనసు నొప్పించాలని నా కనిపించదు. ఎందుకో దాన్ని చూస్తూవుంటే....

కోట:- అమ్మాయిగారు గావకం వస్తదనుండి.

చం|ద్ర:- ఆఁ.... (నిట్టూర్చి) అవును కోటయ్యా, ఆమాట జ్ఞాపకం చేసుకుంటే, గుండె తరుక్కుపోతుంది. నా ఆశలన్ని అడుగంటి పోయాయి. నా బిడ్డే బ్రతికుంటే.......... ఆఁ లేదు లేదు బ్రతికే వుంది. బ్రతికుండాల్సిందే. కాని, ఎన్ని ప్రయత్నాలు చేసినా, ఇంతవరకూ ఆచూకి కూడా దొరకలేదు. ఎప్పటికైనా కనపడుతుందనే ఆశ యింకా పోలేదు. తప్పకుండా కనపడుతుంది కోటయ్యా!

కోట:- ఉంటె కనపడక పోతాది. అయినా ఇట్ట బాధ పడ్తె ఎట్టనుండి.

చం|ద్ర:- నీకేం తెలుస్తుంది కోటయ్యా! మానాన్న చనిపోయి నప్పుడు మాకున్న ఆస్తి ఎంత? ఆ శంకరంగాడి ఆస్తిలో సగం కాదు కదా. పావలా వంతు కూడా లేకుండె.

కోట:- అదేలెరి. వున్నదాంట్లె ఇంత మీ అన్న అమ్ముకొని అటు బెజవాడ బాయె నౌకరికి. ఇంగ మీరేమొ తెగబడి సంపాయించి, శంకరమయ్య ఆస్తికన్న మూడింతలు చేస్తిరి.

చంద్ర:- అవును చేశాను. దానికి కారణం వుంది. మాకు ఏమి లేదని పిల్లనిచ్చేవారు కూడా ఒక్కరు ముందుకు రాలేదు తుదకు ఎలాగో పెళ్ళి అయింది. పెండ్లితో పాటు 'కొంత ఆస్తి కూడా చిక్కింది. దాన్ని ఊతగా తీసుకొని, నన్ను నీచంగా చూచిన లోకం మీద పడ్డాను. ఇంతలో మా అమ్మ పుట్టింది. డబ్బు లేని వాళ్ళను. లోకం హీనంగా చూస్తుందని నా తల్లికి ఏం లోపం రాకుండ, మహారాజు బిడ్డ లాగ బ్రతకాలని, లోకాన్ని దోచాను. పిప్పి చేశాను, అంటే........

కోట:- అదేలేరి, అప్పిచ్చి సంపాయిచ్చిన్రి.

చంద్ర:- అవును. ఎలాగో అలాగు వేలు సంపాదించాను.

కోట:- మెయ్యిలేంది లచ్చలనుండి లచ్చలు!

చంద్ర:- (నిట్టూర్చి) ఆఁ.... ఎన్ని సంపాదిస్తే మాత్రం ఏం లాభం కోటయ్యా, ఏమీ లాభం లేదు.

కోట:- ఏదుండి అట్ల బాధపడ్తరు? ఎట్లనో గుండె రాయి చేసుకొని వుండాలె.

చంద్ర:- ఇన్ని రోజులు ఎప్పుడైనా, నా తల్లి కనపడ్తుందనే ఆశతోనే గుండె రాయి చేసుకున్నాను. కాని, ఇక ముందైనా కనపట్టుందనే ఆశ లేదు.

కోట:- ఊకె ఆమాటే తలచుకుంట కూకుంటె ఎట్లనుండి? ఈమాటిన్నారు, కమలమ్మగోరు, మా లచ్చిమి యీ ఒక్క వూర్నె గాదంట, సుట్టుపట్టు ఊర్లను గూడ ఉద్ధరిస్తెందుకు పోయొస్తున్రింట. యీల్లకీ యీ పిచ్చేందో నాకు మనసుకు పట్టలేదుండి కూట్లె రాయి దీయలేనోల్లు యేట్లె రాయి తీయపోయినట్లు, ఆల్లి ఊల్లు యిడిసిపెట్టి, మన ఊల్లెంట పడ్తరేంది?

చంద్ర:- ఈ కాలం వారికి ఇదో పిచ్చిలే. ఏదో దేశము, అభివృద్ధి అంటూ కలవరిస్తూంటారు.

కోట:- అంతే ఉండట్టుండది. లేకుంటె యిదేందుండి నెరియా మా మరదలైతే, శవ్వ! అందరి పిల్లల్ని ముట్టుకొని తానాలుచేపిచ్చుడు, బట్టలు దొడిగిచ్చుడు, యిసుంటి పనులు సేస్తుంటది.

చంద్ర:- ఒకసారి మందలించి చూడకపోయావా కోటయ్యా?

కోట:- ఒక్కసారేంది లచ్చసార్లు చెప్పిన. యింతకు ముందె ఆల్లక్కకు అన్నాయం చేస్తిని, యింక యీమెనేమన్న అంటే ఏడ్సిపోద్దేమోనని ఏమన్లేక పోతున్న. అదేందొ గానుండి కమలమ్మగోరు గీసిన గీటు దాటదనుకోరి. ఆ సిత్రమేందొ గని, కమలమ్మగోరు సెప్తె, సర్కారుగుడ బాగ ఇంటదె. ఒక అచ్చరమ్ముక్క రాసి పడేసిందొ లేదొ, సేతి పనులు నేర్పెటందుకు మనుషుల్ని తోల్నే తోలె; సర్కార టప్పా గూడ వచ్చె. ఇంకేందొ ఎలక పేరు గూడ తెప్పిస్తదంట.

చంద్ర:- ఆమె తెప్పిచ్చేదేమిటి? ప్రభుత్వమే పంపిస్తుంది. ఏదో ప్రణాళికలంటూ పెట్టారుగా, నాలుగు పైసలు ఖర్చు చేసేందుకు? ఇంకొ నాలుగు రోజులైతే నువ్వు నేను అనే భేదంకూడా లేకుండా చేసేట్టుంది.

కోట:- అదేలేరి, బెమ్మంగారు సెప్పినట్లు, కులాలన్ని, ఒక్కటై పోతయ్యేమో.

చంద్ర:- పొయ్యే కాలంలే. అన్నట్లు రామిగాడు డబ్బిచ్చాడా?

కోట:- ఆడిచ్చుడేంది, అందరిచ్చిన్రి. మరిసే పోయిన్రి ఎట్ల? ఇంగ ఆల్లు మీతానికి రారంట. సాహకార సంఘమో ఏందో పెట్టుకున్న రంటగద. దాంట్లెనే తీసుకుంటరంట. ఇంగ దానికి తోడు ఏదో భూమి తనకా బ్యాంకంట. భూములు పెట్టుకొని అదికూడ ఇస్తదంటగద అప్పులు.

చంద్ర:- ఎన్ని విధాల అప్పులు దొరికినా ప్రభుత్వం ద్వారా, ఆ డబ్బు ప్రజలకు సరిపోదు. మన దగ్గరకు రాకుండా వెళ్ళదు. తెలిసిందా కోటయ్యా.

కోట:- ఆ సిక్కు నాకేమెరుకగని ఇంగ బాకునోడు ముత్తిగా దొక్కడున్నడు. ఆడుగూడ ఇయ్యాల రేపట్లనే కట్టేస్తడంట. కానుండి యీ అప్పు తీర్చుకునోల్లున్నరె. బేసికర్‌గా మీసం మీద సెయ్యేసుకొని మీ కెక్కేందని తిరుగుతుండరు ఉల్లె.

చంద్ర:- ఆఁ అంతవరకూ వచ్చింది. చూస్తూ వుండు. చంద్రం అంటే ఏమనుకున్నారో, వీళ్ళందర్నీ నా కాళ్ళ దగ్గరకు రప్పిస్తాను. అందుకే ఇంతవరకు డబ్బిచ్చిన వారికి ఒక్కరికి కూడా ప్రామిసరీనోటు తిరిగి ఇవ్వలేదు. ఎందుకో తెలుసా, సమయం వచ్చినప్పుడు వీళ్ళందరినీ చేతిలో పట్టుకొని ఆడిం చేందుకు. చూడు. ఏం చేస్తానో.

(వెళ్ళిపోతాడు)

కోట:- నాలుగచ్చరాలు నేర్చినోరు ఏం సేసినా సేస్తరు, మా సేతనేమైద్ది. (అంటూ వెళ్ళిపోవును)

(వీరు వెళ్ళగానే వెనుక తెర లేస్తుంది. వయోజన పాఠశాల దృశ్యం—ఒక బోర్డు మొ. ఉంటాయి.)

(లింగన్న చేతిలో పుస్తకం పట్టుకొని, కూనిరాగంతో ప్రవేశం)

పాట.... జానపదగేయం.... పాట—తిశ్రగతి

లింగ:- నీలు బోసుకో పిల్లదానా నీల్లు బోసుకో
యాదగిరి సామీకి మొక్కు పోదాము. ॥నీల్లు॥
దూగుట్ల ముక్కుపుల్ల తగిలేసుకో
అద్దశేరు బియ్యాన్ది సద్దేసుకో
సద్ది తిని ముద్దూగా కూడిపోదాం. ॥నీల్లు॥

(ఇంతలో ముత్తన్న చేతిలో పుస్తకం, చంకన డప్పుతో ప్రవేశిస్తాడు)

ముత్త:- సరెగని లింగన్నా! మొన్న పట్నంబోయి బలే కోళ్ళని తెచ్చినవే. తెల్లగ, మన కోళ్ళకంటె రెం డింతలున్నయి.

లింగ:- మరేందనుకున్నవు, మంచిరకం కోల్లాయె. ఏడా దికి ఎంతలేదన్నా రెండొందల తొంబై తొమ్మిది గుడ్లు పెట్తయి.

ముత్త:- ఒకటి కాదు రెండు కాదు రెండొందల తొంబై తొమ్మిదా? మాటలు గాకుంటె ఆటిది కడుపా? సెరువా?

లింగ:- అది అంతేలే. ఆ లెక్కంత ఏరే వుండది. అసలు ముచ్చట మరిసేపోయిన, రేపటి సంది కోళ్ళ పెంపక శాలల నువ్వే వుండాల్నంట.

ముత్త:- అగ్గొ అయ్యో మన కోల్లు కూడ గావాయె. ఆట్ని ఎట్ల పెంచల్నో, ఏమొ?

లింగ:- అది నే సెప్తలే.

ముత్త:- మరి నువ్వేం చేస్తవు?

లింగ:- మేమంతా కలిసి గొంగల్లు నేసే సహకార సంఘం పెట్టున్నం.

ముత్త:- అది సరిలె గాని. నువ్వు పట్నం చూసొస్తివి, పట్నం చూసె కాబిలుండాది?

లింగ:- పానముండగా ఒకసారి సూసి తీరాలనుకొ. ఆడ సిత్రాలన్ని సూసి పాటల ఎక్కిచ్చు కొచ్చిన.

ముత్త:- ఏది, ఆ పాట యినిపిచ్చవైతివి?

లింగ:- నువ్వు డప్పు మీన ఏసుకుంట వంతపాడు, నే నినిపిస్తా. ఇంతెల్లమె పంతులు గొంగనె పాటాలు చెప్పించుకుందాం.

ముత్త:- సర్లె, పట్టు.

(ముత్తన్న డప్పు కొట్టుకుంటూ వంత అందుకుంటాడు లింగన్న పాడుతుంటాడు.)

తిశ్రగతి—గేయం

లింగ:- పట్నమయా పట్నము
రంగు రంగుల పట్నము
బల్ రమ్యమైన పట్నము
రంగైన పట్నము.
మీటింగులు పెట్టుకోని ముచ్చట్లు సెప్తమని
పెద్ద పెద్దోరంత గద్దెలమీది కొస్తారు.
గద్దెల ముందొక మేకు గడవోతుగ బాత్తారు
ఆమేకులోన కూకేస్తే మైలుదూరం పోతాంటది.

॥పట్న॥

ముత్త:- మేకేందే మేకు?

లింగ:- అదేరా మేకో మైకో అంటరు దాన్ని.

ముత్త:- ఎలకచేరు జిగేలు మంటెట్టు, యెన్నలారబోసి నట్టు ఉంటవటకదా?

లింగ:- యినుకో యెహ!
సడుగెంబడి తంబాలు తామాసిగ బాత్రిను
తంబాల సుట్టుపట్టు తారుతీగ సుట్టిను
తారుతీగె కెలకచేరు దీపాల్ తగిలిచ్చిను
ఆదీపాల చూస్తాంటె దియ్యలోక మనిపిత్తది.

॥పట్న॥

ముత్తః- బలే బలే ఇంక జెప్పు.

లింగః- ఏడియోకు అచ్చరాలు ఎన్నెన్నో ఏనుంటయ్
అచ్చరాల మీసంగ సన్నది ఒక సూదుంటది
సూదికి దావల పక్కన సిన్నది ఒక మీటుంటది
ఆ మీట దిప్పితె యెయ్యాముడ మాటలు యిన
వస్తాంటయి. ॥పట్నా॥

ముత్తః- అదేమి సిత్రమేయి?

లింగః- మన పంతులింట్ల లేదుఏ లేడియ, గది. ఇంక ఇను.
గాంపోను పెట్టె మీద గీతలున్న పెనముంటది
పెనముమీద ముల్లుంటది. ముల్లుతిప్పె సెయ్యుంటది
ఆ సెయ్యి గనక తిప్పి, ఆ ముల్లుగనక ఆనిస్తె
తీరొక్క పాటలు, రాగాలు ఎన్నో తీస్తాంటది.
॥పట్నా॥

ముత్తః- నిజమే నిజమే. మన సినబాబుకాడ వున్నదిగద.
రొట్టోతుగ ఇంత యెలుపు గీతలుంటయి.

లింగః- అదేలే. యీ మాటిను,
సీనుమానులోని మాయ సిత్రంగా వుంటుంది.
తెల్లటిదొక తెరగట్టి తెరముందల మరబెట్టి
మరదిప్పితె బొమ్మలాడి పాడె మెలక బెట్టిన్ను
సిత్రకారుని సూత్రం సెప్పితె తీరేదికాదు. ॥పట్నా॥

ముత్తిః- సీనిమ కంపెనా? బొమ్మలాడ్తయిగదూ తెరమీన.
ఇంకేం ముచ్చటో చెప్పు.

లింగః- గద్దొలె రెక్కలుంటయి కాల్లకు రెండు
గిర్రలుంటయి
గిర్రలపై బిసలుంటయి, బిసలమీన మడిసుంటడు
ఆ బిస గనక దిప్పిడిస్తే, భూలోకమిడిసిపెట్టి
అంతరాన గాలిమోటరు ఆకాశము సూస్తాంటది
॥పట్నా॥

ముత్తిః- బలే బలే, అయిపోయిందా పాట. బలే సక్క
దనంగ వుందిలే. సరెగని. మొన్నేదొ భాగోత
మేద్దామనుకుంటిమి, నువ్వు నేర్పితివా?

లింగః- నా ముచ్చటిడిసిపెట్టు. నువ్వేం నేర్సినవో సెప్ప
రాదు?

ముత్తిః- నారదునేసం నేర్చిన.

(ఇంతలో పెంటన్న....పుస్తకం తీసుకుని వస్తాడు)

పెంటః- పంతులింక రానట్టుండది గద

లింగః- వస్తదిగని పెంటయ్య మావాఁ, నువ్వు భాగోతంల
యేసం కట్టున్నవా, లేదా.

పెంటః- నాకేమేశం? సక్కంగ సదువే రాదాయె.

ముత్తః- ఇప్పుడందరికీ వచ్చిందా ఎట్ల?

లింగః- వచ్చేశా, ఆదం అనుకుందాం. నువ్వు అర్జునుని వేసం
అనే పెంటయ్య మావాఁ

పెంటః- నాకు రాదుకదురా అనేటందుకు?

ముత్తః- లింగన్న సెప్తడు వటూ

పెంటః- ఇప్పుదేమనమంటవు నన్ను.

లింగః- నేను సెప్పినట్టు అనరాదు.

పెంట;- దాందేది అట్లనే అయిలే.

లింగః- ఇప్పుడు అర్జునుడు తెరనాట్యం బయలుదేరు
తున్నడు. తెరబట్టైహె.

(అని పెంటయ్య కెదురుగా. పై పంచె తీసి లింగన్న,
ముత్తయ్య చెరో పైపు తెరలాగ పట్టుకుంటారు)

పెంటః- ఏందిరా అడ్డంగ తెర కడ్తిరి మొహం కానరా
కుండ.

:- (తెర తీసి చూసును) :-

లింగః- వుందెహె. మొహం లోపలికి పెటుకొ. మేం తెర
తీసిన్దాక కనపడద్దూ. ఆఁరాజా రాజకంఠీరవ తెర
నాట్యం బయలుదేరి.

పెంటః- ఆఁ రాజా రాజకంఠీరవ తెరనాట్యం బయలుదేరి.

లింగః- మేమనే మాట నువ్వంటివేంది.

పెంటః- అనమంటివి గదరా.

ముత్తః- గీమాటానే అనమన్నది. మేం అడుగుతుండం నువ్వు
సెప్పాలె.

పెంటః- సర్లేరి. అడుగురి.

లింగః- రాజా మహరాజా తెరనాట్యం బయలుదేరి మీ
పేరేందొ, సెప్పుకరాండి మహరాజా.

పెంటః- (తెర అడ్డం తొలగించి) నాపేరు పెంటయ్య
గాదుఏ. ఎరికలేనట్టే అడుగుతుండవె?

ముత్తః- దెశ పో. నీ పేరు గాదే, అర్జున్నని సెప్పు.

పెంటః- నా పేరు అరుసుకు.

లింగ:- మీ తండ్రిపేరేవిటో సెలవియ్యండి మహారాజా.

పెంట:- :-తెర తొలిగించి:- మాఅయ్యపేరు సినిపోసిగాడు బండకింద పోసికాడు అని రెండుపేర్లున్నయిలే.

ముత్త:- మల్ల అట్టనే అంటడేందిరో, మీ అయ్యపేరంటే పోశయ్యపేరుగాదే, పాండురాజు పేరు జెప్పు. ఇట్ట కుదరదు. ఊకె ఆదమేసుకోరి.

-: (తెర తీసివేయుదురు) :-

దర్వు అదితాళ్ళం

వాదం:- దర్వు:- ఏకు ఏకు పర్జున విడువర గయునింక విడువక నాతో వాదమా, జడియకనాతో కలహమా.

పెంట:- మరి నేనేమనాలె?

ముత్త:- దర్వు:- విడుచుట మాకుల వృత్తి గాదు ఇది పుడమి రేడులము మేము దడిచెడి వారము కాము.

పెంట:- దర్వు:- విడుచుట మాకులవృత్తి గాదు ఇది పుడమి రేడులము మేము దడిచెటి వారము కాము.

లింగ:- దర్వు:- ఎవరని దడియవు కువలయమందున జణాం జణాం జనా దగ దగ దగదగదోం దద్దై దత్త ధింతా

వచనం:—ఎవరనుకున్నావు? నాకు దడియవా?

పెంట:- నీకు గాదెహ, నీ తాతకు దడవను. భాగోత మాదద మని దడవమంటున్నావు? నీకేమున్న బాకార దడిచె తందుకూ?

ముత్త:- నిన్ను దడవమంటున్నాదే? వాపంల వున్న మాటంటున్నడు.

పెంట:- దేంట్లె కూడైనా దడవమనేది ఏమ్మూలారి? అసుం టిది ఉన్నా తీసెయ్యాలె. మంచోల్లంటరు చెడ్డో ల్లంటరు, దడవమనేదేనా లెక్క?

(ఇంతలో కోటయ్య ప్రవేశం)

కోట:- ఏందిరో అట్ల కొట్లాడుకుంటున్నరూ? సదువ దైందా?

లింగ:- దా దా నీకుగూడ సదువు మీద కాయిసు పడ్డదా ఎట్ట. పలక దెచ్చుకోకపోయినవు?

కోట:- నాకెందుకులే సదువు? నేనేమో నౌకరు సెయ్య బోతనా?

ముత్త: మేమంత సేస్తమనే సదువుతున్నమా ఎట్టాటి కధ?

కోట:- ఇంతైతే మీరు నౌకర్లె సెయ్యరా? అంత మాత్రానికి ఇంక సదువుదెందుకు పని దండగ.

పెంట:- నాలుగచ్చరాలు పొట్టనబడితే తెలివి.తెలివస్తదంట.

లింగ:- తెలివేంది. పపంచంల ఏం నడుస్తున్నదో తెలు స్తుందట.

కోట:- అగ్గో, సదువంటె బూతద్దమా ఏంటి? మరి మీ సదువులు ఎంతమట్టుకొచ్చె. కొసెల్లైనా?

పెంట:- ఇంక మొదలేగాలేదాయె గని కొసెల్తాది?

కోట:- అయితె పొస్తకాలు సేతుల పట్టుకోని తిరుగుతుం డరుగదా మహా సదువుతున్నట్టు?

లింగ:- అవు మల్ల. దాంట్లనే బొమ్మలుంటయి. బొమ్మకో అచ్చరం ఉంటది. ఆ బొమ్మను బ అచ్చరాన్ని తెలుసుకోవాలె.

కోట:- ఇంకేంది. అట్ల తెల్సుకుంటె పాయె ఇంగ పంతులు దండుగేనను.

ముత్త:- గురువులేని సదువస్తాది?

కోట:- వస్తదో రాదో నాకేం తెలుస్తది గని. మొన్న పట్నం నుంచి తెచ్చిన కోడిని అమ్మతారు?

లింగ:- అయ్యొ అమ్మెయిగావు?

కోట:- అంటె సూసుకుంట పూజ చేసుకుంట కూసుంటరా?

లింగ:- నీకెవరు జెప్తరు? గుడ్లు గావాల్నంటె ఇస్తము.

కోట:- కోసిలేంది గుడ్డేం చేసుకోవాలె గనీ. టప్పా నౌకరి ముత్తిగాడు చేస్తడనంగ ఇన్న.ఇప్పుడు భూషయ్య జేస్తుండంట గద.

పెంట:- మొదలు అచ్చే అనుకున్నంగని తీర భూషయ్య పొలం పెద్దాగుల కలసిపాయె. ఇంగ అడి బతుకు దెరవు ఎట్ట ఇంట్లె ఉపాసాలు పండబట్టిరి. అందు కని ఆనికే ఇచ్చిండు సినబాబు.

కోట:- ఇంత పొలం ఇస్తె ఎల్లకాలం బతుకుకద.

పెంట:- ఎంతమందికని ఇస్తడు. ఉన్నది అందరం గలిసే దున్నుకుంటుంటిమి.

కోట:- అదేలే ఇస్తె బాగుండదనే. అందర్ని దున్నుకో మన్నాడు. సినబాబు కాడ ఉపాయాలు తక్కువ ఉండాయి.

లింగ:- నువ్వు ఏదో గెలిగిచ్చుకుంటెందుకు వచ్చినవుగని ఊకె పో.

కోట:- కొడ్తారా ఎట్ట?

ముత్త:- అది నీ పని మా పని గాదులే.

కోట:- సేతనైతే పట్టి సూడరాదురి. ఒక దమ్ము. ఇంగో సెంద్రమయ్యగారు సెప్పమన్న మాట మీతోని సెప్తున్న. మీరందరు ఈడికి రాకుంట మా పార్టీల ఉంటే మీకు ఏదన్న ఓ బతుకు దెరువు సూపిస్త నన్నడు.

లింగ:- ఇప్పుడే హాయిగ బతుకుతున్నంలే. ఎగసాయం చేసుకుంటప్పుడు, ఎగసాయం చేసుకుంటెన్నం పనిలేనప్పుడు, నవ్వారు నేసుడో, గొంగల్లు నేసుడో,............

కోట:- తట్టలల్లుడో,బుట్టలల్లుడో సేసుకుంటున్న మంటరు.

ముత్త:- అవుమల్ల. అట్ట సేసుకొనే సెంద్రయ్య బాకి తీర్చినం.

కోట:- నీ బాకి ఇంత ఉన్నది గాదుర, తీర్చిన్నంటవు.

ముత్త:- నా బాకి మాత్రం ఎంతున్నది. సూస్తుండు గది రేపియ్యాలకు ఇచ్చెయ్యను.

కోట:- అయితె ఇనరన్న మాట.

లింగ:- ఇదివరకు ఏమి యిన్నమో ఇన్నం గని ఇంక ఇంటాం. మా సినబాబు సూపిన బాటే బాగుండది.

కోట:- ఊఁ సరె సూద్దాంపో కష్టాలను మీ కెల్ల మీరే కొని తెచ్చుకొంటున్నరు. సెంద్రమయ్యగారి పగంటె ఏమనుకుంటుండరో.

పెంట:- ఆరి పగ నాకు బాగెరుక పో, దెస పో. సప్పుడు గాకుంట. సేసుకునే దేందో సేసుకోపో........

కోట:- అంతేనంటరా.

లింగ:- అంతగాకపోతే ఎంత. పో, పో.

కోట:- (కోపంతో) మిమ్ముల ఒక్కొక్కని దొరికిచ్చు కోని ఇక్కడికి రాకుంట కాల్లు ఇరగగొట్టకపోతే నా పేరు కోటయ్యే కాదు. కోటయ్యంటే ఏమను కుంటుండరో. డొక్క చించి డోలు గడ్తా.

(వెళ్లిపోవును)

లింగ:- మహగొప్పోవుపో.

ముత్త:- అసలు ఆన్ని ఈన్నించి పోకుంట నడుములిరగ గొట్టనుండె.

పెంట:- అసుంటి పని సెయ్యలేకనాగని సినబాబు ఊకుం టడా, మల్ల మన మొఖం గూడ సూడడు.

లింగ:- నిజమె. ఏదన్న పాటన్న ఇసిపిచ్చే పెంటయ్య మామ. పంతులు వచ్చిందాన్క?

పెంట:- నాకేం పాటలొస్తయారి. అయినా పంతులొచ్చే ఏల్లయింది. పాటలు పాడుకుంట కూసుంటె బాగుంటాది.

లింగ:- పంతులు పాటలు గూడా ఒక కళే పాడుకోవచ్చు అని సెప్పలేదే?

ముత్త:- సెప్పిండుగని ఉంకో మాట గూడ సెప్పిండు. ఇన్నావు.

లింగ:- అదేలే. ఏ పని సేసెటప్పుడు ఆ పని సెయ్యాలని.

(ఇంతలో కమల ప్రవేశిస్తుంది)

కమల:- చినబాబు రాలేదా ఇంకా?

పెంట:- సినబాబు రాలేదుగని కోటయ్యొచ్చిండు.

కమల:- కోటయ్యా! ఎందుకొచ్చాడు? చదువుకోవాలనా?

ముత్త:- ఆనికి సదువెందుకుండీ? మారాజుగ సెంద్రమయ్య గారు వెడుతుంటె కాలుమీద కాలేసుకొని తిరగకా.

లింగ:- గాముచ్చట మనకెందుకారి. రాయబారాని కొచ్చిండు మేమంత ఇక్కడికి రాకుండ ఉంటే సెంద్రమయ్య గారు మాకు ఏదో ఆదరవు సూస్తడంట.

పెంట:- లేకపోతే ఈడికి వచ్చెటోల్లని ఒక్కొక్కల్ని పట్టు కోని కాల్లిరుగ కొడ్తడంట.

ముత్త:- ఇసుంటి బెదిరింపులకు మేం బెదరం పో అని తోల్నం.

కమల:- సరె. పాఠాలు చెబుతా రండి. (బోర్డు మీద రాయ బోయి) మీకు తెలుగు అక్షరాలు అన్నీ వచ్చాయా?

పెంట:- అన్నంటె దాంట్ల ఎన్ని వున్నయో ఏం కథో ఎట్ల సెప్పమంటరు.

కమల:- అయితే వినండి. తెలుగులో మొత్తం అక్షరాలు ఏభై ఆరు. ఈ యాభయ్యారు అక్షరాలను "వర్ణ మాల" అంటారు. అన్ని భాషల్లోకంటే తెనుగులో

అక్షరాలు ఎక్కువ ఉన్నాయి. ఇంగ్లీషులో అన్నిటి కంటే తక్కువ అంటే ఇరవై ఆరు అక్షరాలు మాత్రమే....

ముత్త:- అంటే అన్ని సదువుల కంటె మన సదువే పెద్ద దనుండి.

వెంట:- సెప్పిందాన్కి ఇనిరాదుం సదమనే అడుగుతవు?

ముత్త:- అదెంక మతి కుండొద్దె ఏముండీ ఇట్ట అడుగుడు తప్పంటరా?

కమల:- తప్పేమీ కాదు. అనుమానం వచ్చినప్పుడు అడిగి తెలుసుకోవడమే మంచిది. భాషను బట్టి అక్షరాలు ఏర్పడ్డాయి. అంటే ఇంగ్లీషులో ఒక పదానికి రెండు, లేక మూడు అర్థాలు వస్తూ ఉంటాయి. అంకుల్ అంటే మామ. చిన్నాన్న, మామను, చిన్నాన్నను అంకులు అనవచ్చు. మన తెలుగులో మామను మామే. చిన్నాన్నను చిన్నాన్నే అంటాము.

లింగ:- ఇటు అయ్యతోడ బుట్టినోల్లకు. అమ్మ తోడ బుట్టి నోల్లకు ఒక్కటే పేరు బెట్టింద్రనుండి. కని మనం గూడ అట్ట గలిపితె కలువదానుండి.

ముత్త:- ఆల్ల సదువుల మాత్రం కలిసినాదిర. కలుపుకోవాలె గనీ, మామను సన్నాయన్ను కలుపలే. గట్ల కలుపు కుంటె పాయె.

వెంట:- అంటె మామను సిన్నాయననొచ్చు నంటావా?

లింగ:- అట్లెటంటం.

వెంట:- అందికనే మనబాసల అచ్చరాలు ఎక్కువ ఉన్నయి.

ముత్త:- ఎట్లనైనా అన్ని అచ్చరాలుండుడు మంచిదిగాదెహ. కొత్తంగ నేర్సుకునేటోల్లకైనా కొన్ని తక్కువ సెయ్యాలె. ఆల్లయి ఇరువై ఆరైతె మనయి ముప్పయో, ముప్పయ్యేదో సేసుకుంటె బాయె. ఏముండీ?

కమల:- బలేవారే, నోటిలో నుండి మాట వెల్లడమే తరువాయి, ఆ మాటలను చర్చల్లోకి ఏంపేస్తున్నారే. తెలుగులో కూడా కొన్ని అక్షరాలు తగ్గించే అవకాశం ఉంది. ఆ విషయమై పండితులు ఆలోచించాలి.

లింగ:. మరి ఇన్ని రోజుల నుంచి ఆలోసించక ఏం చేస్తున్నరుండీ రల్లూ?

(ఇంతలో శంకర్ రాగానే అందరు లేచి నిలబడుతారు.)

శంక:- కూర్చోండి. కమలా ఎప్పుడొచ్చావు?

కమల:- రావడం చాలాసేపైంది. కాని బాబూ వీళ్ళకు చదువు ఎలా చెబుతున్నావో, ఏమో కానీ. మాట నోటి నుండి వెళ్ళడమే తరువాయి, దాన్ని చర్చల్లో పెట్టేస్తారు. నేను మీరు వచ్చే వరకు పాఠాలు చెబుదామనుకొని మొదలుపెట్టాను. సాగనిస్తేనా?

శంక:- ఏదో వాళ్ళకు తెలియనివిషయం అడుగుతుంటారు. నన్ను మాత్రం విడిచిపెడతారనా నీ అభిప్రాయం?

(ఇంతలో భూషయ్య ప్రవేశం)

భూష:- ఇంగో నుండి పత్రిక.

కమల:- (తీసుకొని) అందరికీ ఉత్తరాలు సరిగ్గా అందిస్తున్నావా?

భూష:- ఆ పని మంగల సేసిగని నోట్లె మంచినీళ్ళు బొయ్యను. ఇంగ బొయ్యొస్త. ఉత్తరాలు పంచాలె. బువ్వ తిని మల్లొస్త లేరి.

కమల:- (సరె వెళ్ళు)-(అంటూ పత్రిక చూచి) శంకర్ అభ్యుదయ ఉత్సవాలను గురించిన వివరమంతా వచ్చింది.

శంక:- సరె, ఆ విషయం తరువాత ఆలోచిద్దాం మీ పనులు ఎలా సాగుతున్నాయి?

కమల:- అన్నీ సవ్యంగానే సాగుతున్నాయి.

శంక:- కుటీర పరిశ్రమలను మనం ఇంత కష్టపడి పెట్టించి నందుకు, వచ్చి బాగా నేర్చుకుంటున్నారా ప్రజలూ?

ముత్త:- సిన్నగంటరేంది. నేర్సుకునోల్లు పనులు సేసు కుంటనే ఉన్నరు. కొత్తంగ నేర్సుకుంటోల్లు నేర్సు కుంటనే ఉన్నరు. జనానికి పైసలొచ్చే దారుంటే ఊకుంటరనుకుంటున్నారా ఏంది. ఆడోల్లయితే ఎగబడి నేర్సుతున్నరు.

శంక:- అయితే సంతోషం. లక్ష్మి పనులు ఎలా సాగు తున్నాయి.

లింగ:- ఏమెకైతె సెనం తీరదనుకోరి. హరిజనగూడెం ఇప్పుడు సూడు పోరి, సెద్ది సెదారం లేకుంట

సుబ్రంగ అద్దమోతుగా ఉండది. ఇంత నా మాట అబద్ధమైతె ముత్తిగాన్నడుగురి.

ముత్త:- నిజమేనుండి. పిల్లగాండ్లకు తానాలు గూడ సేపిస్తుంటది.

శంక:- సరె. ఆఁ. మీకు ప్రపంచ పరిస్థితులను గురించి ప్రతిరోజు చెబుతూ ఉన్నాను. ఈ రోజు మిమ్ముల కొన్ని ప్రశ్నలు అడుగుతాను చెప్పండి.

లింగ:- ఇయ్యాల మనకు పరీచ్చలొచ్చినయిరో. అడుగు దుండి. అడుగురి.

శంక:- ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్యమైన ప్రాజెక్టు ఏది?

ముత్త:- ఆంధ్రకేమొచ్చింది, దేశానికే ముఖ్యమైనదంటురి గదుండి, నాగార్జునసాగరమూ. కాదా ఎట్లా.

శంక:- చూచావా కమలా?

కమల:- చూడడ మేమిటి వింటూనే ఉన్నాను.

ముత్త:- తప్పున బడ్డనంబారా?

శంక:- తప్పేమీ కాదు. మన భారతదేశానికి ముఖ్యమైన ప్రాజెక్టు నాగార్జునసాగర్. పోతే ఏ ప్రాజెక్టు తెలంగాణా అంతటికి ప్రయోజనకారి?

లింగ:- పోచంపాడు అన్నట్టంటిరిగద.

కమల:- చాలా తెలివిగా జవాబు చెబుతారే మీ శిష్యులు. నేను వెళ్ళొస్తాను.

శంక:- ఇంకా కొన్ని విషయాలు, మా శిష్యుల నోటి నుండి విందువుగాని కూర్చో.

ముత్త:- ఇంగ మాట్లాడకుండి. మమ్ముల ఏదో అంటున్నరూ?

కమల:- ఏమీ అనటంలేదు ముత్తన్నా, ఊర్కే.........

లింగ:- తెలివి కల్లోల్లంటుండరు గద సదువుకున్నోరు మీరు. సదువురానోరము మేము, గట్టనుడేం బాగుంది.

కమల:- అయితే అనంలే.

పెంట:- అంటేదిరా? ఏమన్నా మనకు తెలువనివి తెలుసుకునుడే లెక్క. అడుగురుండి అడుగురి.

శంక:- చూశావా కమలా. ఆఁ చెప్పండి దేశానికి పెద్ద పరిశ్రమలు ముఖ్యమా చిన్న పరిశ్రమలు ముఖ్యమా?

పెంట:- రొండపనం మే. జర బయటికి పొయ్యొస్తునుండి. పనుండదీ.

(వెళ్లిపోవును)

లింగ:- పెద్దయేమో నిమ్మలంగ అక్కరొస్తయి. సిన్నయేమొ దబ్బున అక్కరొస్తయి.

కమల:- భేష్, బాగా చెప్పావు. నేనొకటి అడుగుతాను చెప్పండి, కుటీర పరిశ్రమల వల్ల ప్రయోజన మేమిటి?

ముత్త:- ఇదింకా బాగుండది. అసలు గ్రామలల్ల ఉన్న ప్రజలకు ఉన్నదే ఆటితోనాయె లాభం. మనూల్లె ఇయ్యి పెట్టినకాన్నుంచె అందరం తీరినప్పుడు ఏదో ఓ పని జేసుకోని అప్పులు గీన తీర్సుకుంటున్నం.

కమల:- బావుంది. అయితే చాలా విషయాలు చెప్పారన్న మాట.

శంక:- ప్రపంచ పరిజ్ఞానం కలుగడం చాలా అవుసరం కదూ కమలా. నువ్వు కూడా స్త్రీలను కూర్చోబెట్టుకొని ప్రతిరోజూ కొన్ని విషయాలు చెబుతూ ఉండు. స్త్రీలే దేశానికి పట్టుగొమ్మలు.

కమల:- పురుషులు మూలవిరాట్టులు.

శంక:- ఆ పదవి దక్కాలంటే స్త్రీలు అన్ని విధాలా చదువుకొని ముందుకు రావాలి.

లింగ:- ఇంకెందుకుండీ ముందులకి. ఇప్పటికె సెడబడ సదివి తెగబడి నౌకర్లు సేస్తాండ్రు. ఇంగ ముందు ముందు మొగోల్లకు నౌకర్లే దొరకనట్టున్నయి.

శంక:- దొరకవని కాదు గానీ. మిషనరీ మొదలైన కొన్ని బరువు పనులు పురుషులకు అప్పజెప్పి, క్లర్కులు మొదలైన కొన్ని తేలిక పనులు స్త్రీలకే కేటాయించ వచ్చు ప్రభుత్వం.

ముత్త:- అంతే లేరి. ఆడోల్లు ఆడోల్లంటం గని మనకంటె ఆల్లె నయం. అన్నీట్ల ఆల్లె లాభాన పడ్తరు. రైల్లనూడిర్రి. దబుక్కున ఆడోరి డబ్బాలకు మొగోల్లం బోతిమా కాగులు ఎగబడట్టు ఎగబడి ఎల్లగొడ్తరు, అప్పుడు మొగోల్లు సూస్తె కొట్టినే కొడ్తరు. ఇంగ ఆడోల్లె మొగోల్ల డబ్బా కొస్తే

కూసోండి అని కూసోబెడ్తరు అన్నితీర్ల ఆడోల్లెకి లాభమా నుండీ.

కమల:- బలే వాడివే. కొన్ని పనులు స్త్రీలు చేయలేరుగా. అందుకని వారు చేయగలిగిన పని వారికి నప్ప చెప్పడం మంచిదంటావా కాదా?

లింగ:- అన్ని పనులు గూడా ఆడోరు మొగోరు కల్సి సేసుడు మంచిదుండి. ఆల్లకు సేతగాని పని మనం మాత్రం ఎందుకు సెప్పుతం. ఇప్పుడు నేను మన్ను తవ్వుతుంటె మా ఆడది తట్ట ఎత్తుకోదండీ. గదే లెక్కనుకోరి.

శంక:- బాగా చెప్పావు. తేలిక పనులు మొదటినుంచి వాళ్లకే ఇస్తున్నాం. బరువుపనులు మనంచేస్తున్నాం. అంతేగా నువ్వనేది.

లింగ:- నేననేదేందుండి, జరుగుతున్నమాటనేనంటనేమో. సనా పొద్దుబోయింది, పోదామంటరా.

(ఇంతలో ముత్తయ్య, లింగయ్య చెవిలో ఏదో చెప్పుతాడు)

లింగ:- దీంట్లె గున. గుసేందారి. ఎల్లబర్కెదానికి.

కమల:- ఏమిటి సంగతి?

లింగ:- సినబాబు ఓ పాట నేర్పిచ్చిండంట. అది ఇనిపిస్త నని డప్పు కూడ తెచ్చుకున్నడు.

కమల:- అలాగా. చినబాబు కవిశేఖరులన్నమాట?

శంక:- ఏదో కమలా, నా మనస్సుకు తోచిన విషయాలు ఒక కాగితము మీద రాస్తుంటాను.

కమల:- దాన్నే కవిత్వం అంటారులే. ఆ(పాడు ముత్తన్నా. విందాము.

ముత్త:- సిగ్గై తుసదుండీ.

లింగ:- కమలమ్మ గోరుంటేంగారి. మీరు ఉన్నరని సిగ్గు పడుతున్నడుండీ.

కమల:- అయితే నేను వెళ్లిపోతానులే.

ముత్త:- వద్దులేరి. సదువత.(అటూఇటూ చూచి) పెంటనవ్వ పోయినట్టుండది గద. నువ్వెందుకో వంత.

డప్పుకొట్టుకుంటూ పాడుతుంటాడు

పాట. ఆది తాళం

తాలీ తాలీలల్లయ్యలో తప్పుదారి నడువద్దండయో
కాలుపైన కాలేసే రోజులు
కట్టువెత్తనం చేసే రోజులు
డబ్బె సర్వమని మురిసే రోజులు పోయినాయి
అయిపోయినాయి ॥ తాలీ ॥

ఒల్లువంచి పచేనిసే రోజులు
బుద్ధితెచ్చుకొని బ్రతికే రోజులు
జాతిక్షేమమే కోరే రోజులు
కలిసీ మెలిసీ బ్రతికే రోజులు
వచ్చాయి అయివచ్చాయయో. ॥ తాలీ ॥

(ఇంతలో భూషయ్య కట్ట దెబ్బతిని)

భూష:- అబ్బా!

(అని క్రిందపడును, అందరు దగ్గరికి వచ్చి పట్టుకుంటారు)

కోట:- (స్టేజిమీదకొచ్చి) మీ అందరిగతి ఇంతే అయుతది. ఒక్కొక్కర్ని డొక్కచించి డోలుగడ్త.

(అనుకుంటు వెళ్లిపోవును)

ముత్త:- సూస్తవేందే లింగన్న పదెహ పదు ఈని సంగ తేందో కనుక్కుందాం.

(కట్టెలు తీసుకొని పోబోవగా)

శంక:- ముత్తన్నా. లింగన్నా తొందర పడకండి.

( తె ర బ డు ను )

—: రెండవ రంగం సమాప్తం :—

* * *

## (3 వ రంగం)

### బుర్రకథ

కథకుడు:— అంత చంద్రం తన అధికారాన్ని నిలువుకునేటందుకు....

సామదాన దండోపాయమ్ముల
చేసె ప్రయత్నములు ఎన్నెన్నొ
ఎన్ని చేసినా వ్యర్థమాయె, ఒక్కొకక్కటి వరసగనూ....తందాన.

వచనము:— ఒకరోజు చంద్రానికి ఏదో ఆలోచన తట్టింది.

వంత :— ఏం చేశాడేం.

కథకుడు:— చెబుతా విను.

వి న రా భా ర త భా వి పౌ రు డొ క వి ం త గా ధ నే డూ.
కాళ్ళకు చెప్పులు నోటిలో చుట్టా కట్టనందుకోని
బిర బిర బిర బిర బిర బిర బిర బిర తరిలె ఇంటినుండీ
ఆలోచిస్తూ ఆవేదనలో అన్ను మిన్ను యనకా
బయలుదేరె బాజారువెంట బహు చిందులు ద్రొక్కుచును.
తన అనుచరులకు ఏమో చెప్పి తరలె అచటినుండీ.

(తెరబడి లేచేవరకు రాత్రి పాఠశాల రెండు కుర్చీలు, మద్దెల, డప్పు, హార్మణి ఉంటాయి. ఇంతలో చంద్రం....)

చంద్ర:- కోటయ్య మీద కేసు పెడతారట కేసు. ఈ చంద్ర మంటే ఏమనుకున్నారో ఏమో.

(అటుఇటూ తిరుగుతుండగా లక్ష్మి వస్తుంది)

లక్ష్మి:- నమస్కారమండీ.

చంద్ర:- (కోపాన్ని పూర్తిగా తగ్గించుకొని) నువ్వా లక్ష్మీ! కనపడటం లేదే. ఆc, కోటయ్య వచ్చాడా?

లక్ష్మి:- రావడమేమిటి, ఊళ్లో లేడా?

చంద్ర:- ఇంకా నీకు తెలియదా ఏం మీ గ్రామానికే పోయాడే

లక్ష్మి: మా గ్రామానికా! ఎందుకూ?

చంద్ర:- వచ్చిం తరువాత కోటయ్యనే అడుగు. అయితే కోటయ్య ఇంకా ఊరినుండి రాలేదన్నమాట.

లక్ష్మి:- రాలేదండీ. వస్తే మీ దగ్గరికేగా ముందుగా వచ్చేది.

చంద్ర:- అవునులే రాకపోవడమే మంచిది.

లక్ష్మి:- ఏమిటండీ మీరనేది. మీరిక్కడికి ఎందుకొచ్చారు?

చంద్రం:- నేనా! నీ కొరకే నిన్ను తీసుకు పొయ్యేటందుకే. ఇంకా తెలియలేదన్నమాట.

లక్ష్మి:- ఏమిటో మీ మాటలు అర్థం కావటం లేదు నాకు.

చంద్రం:- ఇంత విప్పిచెప్పినా అర్థం కావడం లేదా! నువ్వు ఏ రోజు నా కండ్ల పడ్డావో ఆ రోజు నుంచి నిద్రాహారాలు లేక తపించి పోతున్నాను. ఇంకా ఎన్ని రోజులు ఇలా ఉండిపోవడం. రావే చిలకా! రా! (అని పట్టుకోబోవును)

లక్ష్మి:- (దూరంగా వెళ్తూ) ఏమిటండీ పెద్దవారు, అన్నీ తెలిసినవారు మీరే అన్యాయానికి వడి గడుతున్నారా?

చంద్రం:- ఏది చేసినా పెద్దవారే చేయాలి, చిన్నవాళ్లకు అంత దమ్ములుండవు. (నవ్వి) రా! మా ఇంటికి పోదాం రా. నీ కెందుకీ కష్టమంతా, సుఖంగా....

లక్ష్మి:- చాలూరుకోండి. పెద్దవారని ఇంతవరకూ మర్యాదగా చూశాను. స్త్రీలంటే మీరు చెప్పినట్టు విని ఆడే కీలుబొమ్మలు కారు. దూరంగా ఉండు.

చంద్రం:- (నవ్వి) మెచ్చాను, కోపంలో కూడా నీ చక్కదనం చెదిరిపోవటం లేదు, పెరిగి పోతూవుంది. నీ మాటల్లోని సొగసు నన్ను ముగ్ధుణ్ణి చేస్తున్నది. రా, నీ కొరకు స్వర్గం నిర్మిస్తాను.

(అని గబుక్కున చెయ్యి పట్టుకుంటాడు)

లక్ష్మి:- కదుల్తావా లేదా? (అని చెంప మీద కొట్టును, వెనుగులాడుతూ) బయటికి సాధురూపం. లోపల వ్యాఘ్రరూపం, ఛీ దుర్మార్గుడా, వదులు.

చంద్రం:- ఏ రూపంలో కనబడాలంటే ఆ రూపంలో కనపడుతాం. తెలిసిందా. ఇంతవరకూ చెంప దెబ్బ

ఎవరితోనూ తినలేదు, నీతో తిన్నాను. కేవలం నీతో. పరవాలేదు. నడువు.

లక్ష్మి:- నన్ను వదిలి పెట్టు. నన్ను వదిలి పెట్టడం నీకే మంచిది. తరువాత .... ....

చంద్రం:- బాధపడుతానంటావు. అంతేనా. పరవాలేదు, నడువు (అని లాక్కుపోవటానికి ప్రయత్నం చేయును, లక్ష్మి పెనుగులాడ్తుంటుంది....ఇంతలో శంకరం ప్రవేశించి)

శంక:- ఆగు. వదిలిపెట్టు. దొడ్లో వున్న పశువులను విడిచి పెట్టి, ఎవరో కొట్టుకపోతున్నారని మాకు చెప్పించి మమ్ములను అటు పంపించి ఇక్కడ నువ్వు చేసే పని ఇదా, వదిలిపెట్టు, ఇంతవరకూ నీ దుర్మార్గం సహించి ఊర్కున్నాను. ఇక సహించలేను.

చంద్రం:- (నవ్వి) రా నీ కొరకే చూస్తున్నాను. నిన్నొక్కడిని యమలోకం పంపిస్తే నా దారికి అడ్డం వచ్చే వారు ఎవరూ ఉండరు.

(అని కఱ్ఱ ఎత్తి కొట్టబోవగా, శంకరం కఱ్ఱతో ఆపుకొని కొట్లాడుతాడు. ఇంతలో చంద్రం జేబులోనుంచి మన్ను తీసి కండ్లల్లో చల్లుతాడు. శంకరం కఱ్ఱ క్రింద పడవేసి....)

శంక:- అబ్బా! కొట్లాడటం చేతగాక కండ్లలో మన్ను చల్లుతావా నీచుడా?

చంద్రం:- (నవ్వి) శక్తి వున్నా యుక్తి కావాలి యుక్తి. యుక్తిముందు శక్తి ఏం చేస్తుంది? తెలిసిందా? పో, యమలోకానికే పోతావో, స్వర్గలోకానికే పోతావో పో, అది నీ ఇష్టం. పంపించడం మాత్రం నా వంతు.

(కఱ్ఱ లేపి కొట్టబోగా, లక్ష్మి కఱ్ఱ అందుకుని అడ్డుకుంటుంది).

లక్ష్మి:- ఇక నీ ప్రాణాన్ని కాపాడుకో, స్వర్గ,మర్త్య పాతాళాల్లో ఏ లోకానికి పోతావో పో.

(అని కొట్టును. ఆ దెబ్బ చంద్రం చేతులకు తగుల్తుంది. కఱ్ఱ కింద పడ్తుంది)

చంద్ర:- అబ్బా! చేతులు విగిరినట్టున్నాయె!

(అని చేతులు చూసుకొని తిరిగి కఱ్ఱ పట్టుకోలేక నిలబడి ఉంటాడు.)

లక్ష్మి:- చేతులు విరగటం కాదు, ఇప్పుడు తల పగులుతుంది.

(కఱ్ఱ ఎత్తి కొట్టబోవగా)

శంక:- లక్ష్మీ! ఆగు. నీకు సాము నేర్పిందీ ప్రాణాలు తీయడానికి కాదు. రక్షించుకోవడానికి మాత్రమే.

(అనగానే లక్ష్మి ఆగిపోయి. కఱ్ఱ దించుతుంది.)

చంద్ర:- (కోపంతో) ఊఁ. అంతా మొనగాళ్లే. ఇప్పుడు తప్పించుకున్నా ఇంకెప్పుడూ తప్పించుకోలేరు నా చేతిలోనుండి. శంకరం! ముందు నీవంతే వస్తుంది. చూసుకో.

(వెళ్లిపోవును)

లక్ష్మి:- వెళ్లిపోయాడు దుర్మార్గుడు. రండి ముఖం కడుక్కుందురు. చాటుగ ఇసుక తెచ్చుకొని చల్లడం ఒక గొప్పేనా?

(అని చేయిపట్టుకొని, శంకరాన్ని బయటకు తీసుకెళ్తుండగా, శంకర్ తడుముకుంటూ వెళ్తాడు వెంట.)

(ఇంతలో ముత్తన్న పాట పాడుకుంటూ, డప్పు మీద వరస వేసుకుంటూ వస్తాడు....)

పాట—తిశ్రగతి

ముత్త:- వాహ్వారె ముద్దులగుమ్మా వగలమారి ముద్దులగుమ్మా
సట్టున్న సూర్యాపేట నట్టనడుమ నల్లగొండ
అవతలా హైదరాబాదు, దానెనుక గోలకొండ
గోలుకొండా ఖిల్లా మీద ఉన్నాది రాజమహలు
ఆ మహలు ఎక్కి చూస్తే ఢిల్లీలో లాల్‌ఖిల్లా
ఆ ఖిల్ల ఎక్కి చూస్తే అవతాల చంద్రలోకం
నీ కంటి పాపలోనా కనబడునె ముద్దుగుమ్మా
వయ్యారి ముద్దుగుమ్మా వగలమారి ముద్దుగుమ్మా.

(అని చుట్టూ తిరుగుతుండగా లింగన్న వచ్చి నెత్తి మీద కొట్టి)

లింగ:- బలే వజనైన పాట పాడుతుండవారీ.

ముత్త:- ఓసోసి నువ్వా. దరువు పడుతున్నదంటవా బాగ.

లింగ:- యమ మోతగ పడుతూందిలే. నాకే ఆడబుద్ధయితుందెనేమో.

ముత్త:- నిజంగనేనా?

లింగ:- ఈ పాట పాడాలె అభ్యుదయ ఉత్సవంల.

ముత్త:- బాగుందంటవా మరి?

(ఇంతలో కమల ప్రవేశించి)

కమల:- చినబాబు రాలేదా ఇంకా?

లింగ:- సినబాబుగారి గొడ్లని వోరో కొట్టుక పోతున్నరంటే అందరం గలిసి పోయినం. ఆడికి వొయ్యే వరకే కంచల తమాసిగ మేస్తున్నయి. అట్నే దొడ్లె దోలి మేమొచ్చినం. మాకంటె ముందల్నే సినబాబు బయలుదేరిండు రాలేదుగద.

ముత్త:- అవునండీ. అంత, మాయగ ఉండది. చంద్రి మయ్య గారు అప్పు ఉన్నోల్లు అప్పు గట్టినంక గూడా, కాయితాలు దగ్గర పెట్టుకోని మీరు సభల కెల్లినగానీ, ఆల్లతోని తిరిగినాగని, కేసు పెట్త మని భయపెట్తుండాడంట. భయపడి ఒక్కల్లుగూడ వచ్చేటట్టు లేదు. ఇంక నయం. మిమ్ముల ఏమంట లేడు.

కమల:- నన్ను మాత్రం విడిచిపెడుతున్నాడా ఏం. నన్ను అనేది నన్నూ అంటూనే ఉన్నాడు.

ముత్త:- ఎట్టనైనా జర మిమ్ముల జూస్తె పానమే నుండి. ఇంగ మీరు మాదాంట్ల కలిసింద్రనే కోపమే ఎక్కువ.

లింగ:- ఓరి కోపం ఆరికే ఉండెగనీ, సబేమో రేపేనాయె. మనం ఓ పాలి అనుకుంటె గని, రేపు సభల కోలాటం ఎయ్యలేం. ఏముండీ శంకరమయ్యగారు ఎచ్చేదాన్క కోలాటం ఏద్దామంటరా?

కమల:- కానివ్వండి. ఊర్కె కూర్చోవడమెందుకు.

ముత్త:- కోలాటం కట్టిలు పెంటన్న తెస్తనని ఇంకా తేడా యెనే.

పెంట:- (ఇంతలో కోలాటం కట్టిలు చేత పట్టుకొని ప్రవేశించి) ఎత్తనే ఉన్న నెహ. (అంటూ అందరికి ఇస్తాడు) మూడు సేతులు ఎట్ట గలుస్తయిరా?

లింగ:- కమలమ్మ గోరికె రావనుకుంటుండవా ఏంది. తీసు కోరుండి మీరు గూడా?

(అని ఒక జత కోలాటం కట్టిలు కమలకు ఇస్తాడు. అందరు కలుపుకున్న తరువాత, లింగన్న పాట చెబుతుంటాడు)

పాట—ఖండగతి.

లింగ:- కదలవోయ్ ముందుకూ రైతన్నా! దేశ
భాగ్య రథమును నడుప మాయన్నా!
నీ హలము మీదె
భారత కులము బ్రతుకునూ!
నీ శక్తి మీదె భారత శక్తి పెరుగును!
నువ్వె మూలము గాద రైతన్నా!
దేశ భావి తీర్చియు దిద్ద మాయన్నా! ॥కద॥
నీకు చేయూతకై జీవ నదులను మలిసి
పథకమ్ములను చేర్చి ప్రాజెక్టులను గూర్చి
చేయెత్తి సర్కారు రైతన్నా నిన్ను
చేరి రమ్మనుచుండె మాయన్నా! ॥కద॥
పిలుపులను అందుకో
తలపులను తలచుకో
కట్టవోయ్ నడుమును
కొట్టవోయ్ జయభేరి
కలుపవోయ్ చెయి చేయి రైతన్నా
నిలుపవోయ్ నీ కీర్తి మాయన్నా! ॥కద॥

(ఇంతలో లక్ష్మి ప్రవేశిస్తుంది)

కమల:- ఇంత ఆలస్యం అయిందేమి లక్ష్మీ. శంకర్ రాలేదేం?

లక్ష్మి:- వస్తున్నాడు. ఎవరితోనో కలిసి ఎస్తాను. నువ్వు ముందు వెళ్ళమని చెబితే ఎచ్చేశాను.

పెంట:- పాట బాగున్నాదుండీ. సినబాబే రాసి నేర్పిండు లింగనికి.

కమల:- అన్నిట్లో ఉన్నాడు మీ చినబాబు.

లక్ష్మి:- నాకు కూడా ఒక పాట రాసి ఇచ్చాడు అక్కయ్యా. అభ్యుదయ ఉత్సవంలో పాడమని.

ముత్త:- నేను డప్పు కొడ్త పాడుండీ.

లింగ:- ఇంక జూస్తరేంది, కానియ్యిరి.

లక్ష్మి:- అడుగులు వేసుకుంట పాడాలి అక్కయ్యా.

ముత్త:- మోతగుంటది కానియ్యండీ.

లక్ష్మి:- ఆడుతూ, పాడడం కష్టం అక్కయ్యా.

లింగ:- కమలమ్మగోరు పాడ్తది ఆ కాయితం ఇచ్చేయిరి.

కమల:- సరె. పాడ్తాను తే.

(కమల పాడుతుంటుంది. లక్ష్మి ఆడుతుంటుంది. ముత్తన్న డప్పు కొడుతుంటాడు...)

కమల:- పాట—ఆదితాళం

కష్ట సుఖములు కావడి కుండలు
కష్ట మొచ్చితే భయపడెదెందుకు
చేయి చేయీ కలుపాలే తానే తందానే
భాయి నడుము బిగించి నడువాలె తానే తందానె.
అందరమొకటై ఆత్మ శక్తితో
ముందుకు నడిస్తె ముల్లోకాలే
పీల్చుకుతినేటి పిశాచమ్మొలే
తలవంచీ సలాముననూ తానే తందాన
అది మెడవంచీ పరారౌనూ తానే తందాన.

(ఇంతలో శంకరం వస్తాడు)

శంక:- చాలా బావుంది. రిహార్సల్స్ చేస్తున్నట్టుందే?

కమల:- అవునుగానీ నీ కళ్లు అలా ఎరుపెక్కాయేం.

శంక:- ఏమి లేదు. ఇసుక పడింది.

లింగ:- మరి భాగోతం పెట్టరుండి దాంట్ల. లేకుంటె సుద్దు లన్న పెట్టురి.

లక్ష్మి:- అవును అక్కయ్యా, సుద్దులు ఉండాలి.

శంక;- ఆఁ. రిహార్సల్స్ కానివ్వండి. బాగుంటె పెడదాం.

ముత్త:- సెప్పరాదె నేను పెంటన్న సుతిబద్దం.

లింగ:- తప్పులుంటె సెప్పాల్నండీ.

లింగ:- అరే మొదలు గంగమ్మ తల్లిని తలువొద్దురి?

ముత్త:- అమ్మో గంగమ్మ తల్లిని దలువకుంటె కోపం రాదె ఆ తల్లికి, కానియ్యి.

లింగ:- ద్విపద వంతలు.

గంగరి వయి గంగా పాతాళ్ళగంగా పాతాళ
గంగా ఆఁ ఈఇ...

పుట్టితివి నువు గంగా బుగ్గిలోపలాను
పెరిగితివి నువు గంగా పెన్నలోపలాను
తొడిగితివి నువు గంగా దొంతోళ్ళ రయికా
సముద్రాడితివి నువు గంగో గట్లల్లోనా.

ఆఁ..యాఁ...

ముత్త:- ఆఁ ఇంగ సెప్పకరా!

లింగ:- భళి భళిరే మాతాత బల్లెంబు బట్టి
బందరు పట్టణం మీదికీ దండు వెళ్లాడు.

వచనం:- పోతాంటే ఇంతలోపల్నె ఓ ముసలమ్మ ఎదురుగా వచ్చింది. ఆ ముసలమ్మను చూచి...

(పాటలో) గురిజాసి ముసలమ్మ గుండె నాటాదో
ఆఁయా...

ముత్త:- ఇదేం నాగలేదు. గోత్రాలు జెప్పు.

లింగ:- సెప్త. విను.

పాట—ద్విపద

గొల్లల గోత్రాలు గొర్రెల కెరుక
గొర్రెల గోత్రాలు గొల్లల కెరుక
వారివీరి గోత్రాలు తోడేలుబావ కెరుకో.

ఆఁ యాఁ...

అత్తల గోత్రాలు కోడళ్ళ కెరుక
కోడళ్ళ గోత్రాలు అత్తల కెరుక
వారివీరి గోత్రాలు ఇద్దరి నొత్తుల నలిగినచ్చే
మొగాళ్ళకెరుకో. ఆఁ యాఁ...

శంక:- (చప్పట్లు కొట్టి) చాలా బాగుంది కమలా! ఏమే కార్యక్రమాలు పెట్టున్నామో, ఒక లిస్టు వ్రాను కొని ఉంచుకో. ఆఁ.... కలక్టరుగూడా వచ్చేస్తున్నాడు. ఈ దెబ్బతో గ్రామీణ కళాకారులలో ఎలాంటి వారు ఉన్నారో లోకానికి చూపెడదాము. లక్ష్మి, లింగన్నని, పెంటయ్యను తీసుకెళ్ళి. మన ఇంట్లో వున్న సామానులన్నీ స్టేజి దగ్గరకు చేర్పించేసిరా.

లక్ష్మి:- మంచిదండీ.

శంక:- వెళ్ళండి.

(లింగన్న. పెంటన్న, లక్ష్మి వెళ్ళిపోవుదురు)

ముత్త:- నన్నేం చెయ్యమంటరు?

కమల:- రేపటి నుంచి అభ్యుదయ ఉత్సవాలు జరుగుతున్నవని అందరు రావాలి అని చాటించిరా.

ముత్త: నర్లేరి. అభ్యుదయం ఉత్సవం గాదుంసి.

కమల:- అభ్యుదయం వేరు ఉత్సవం వేరు కాదు. ఆరెండింటిని కలిపనాలి.

ముత్త:- ఇంగామాత్రం అల్లు కలుపుకోలేనా. అన్ని కలిపి ముందల పెట్టాల్నా!

(అంటూ ముత్తయ్య వెళ్ళిపోవును)

కమల:- (నవ్వి) వీళ్ళ మాటలు విచిత్రంగా వుంటాయి.

శంకరం:- అవును కమలా. ఈ ఉత్సవాలు ఎలాగో జరిగి పోయి, ఆ పెద్ద వాగుకు ఒక కట్ట వేయించామా అంటే చాలా వరకు మన బాధ్యత తీరుతుంది.

కమల:- తీరుతుందని నేననుకోను. కొంత తగ్గుతుందని అంటే ఒప్పుకుంటాను. అయినా మీరు తలుచు కుంటే కాని పనంటూ ఉందా?

శంక:- నా మీద అంత నమ్మకం ఉందా కమలా?

కమల:- నమ్మకమే కాదు........

శంక:- ప్రేమ కూడా ఉందంటావు అంతేనా. మన ప్రేమకు చాలా అడ్డంకులున్నాయి. ఈ అడ్డంకులు దాటి బయలు పడతామనే నమ్మకం నాకు లేదు. మీ బాబాయి "నా ప్రాణముండగా ఈ పెళ్ళి జరిగేందుకు వీలు లేదు" అని ప్రతిజ్ఞ పట్టాడట.

(ఇంతలో చంద్రం)

చంద్ర:- అవును, అంతే కాదు. నీ ప్రాణం తీసేస్తానని కూడా పట్టాను ప్రతిజ్ఞ. అప్పుడు తప్పించుకుంటే ఇప్పుడు తప్పించుకుంటావా? యమలోకం పోతావో, స్వర్గలోకం పోతావో పో నీ ఇష్టం.

(అని శంకరం తలపై కొట్టును. శంకరం "అబ్బా" అని పడిపోవును)

కమల:- బాబాయి ఎంత పని చేశావు. నీకేమి అపకారం చేశాడు.

(అని దగ్గరకు పోయి కట్టు కడుతుండగా, పెంటయ్యా వచ్చి చూసి, పెద్దగా నవ్వి. బొడ్డులో వున్న జమియా తీసి కమల దగ్గరగా వచ్చి)

పెంట:- మా చినబాబును చంపినావా, చూసుకో. నీ పగ నువ్వు తీర్చుకుంటే నా పగ నేను తీర్చుకుంట. ఇది ఎవరనుకున్నవు, నీకన్న బిడ్డ! ఎన్నో ఆశలు పెట్టుకొని, మందిని దోసి సంపాయిచ్చినవే ఆ బిడ్డే ఈ బిడ్డ.

(ఇంతలో లక్ష్మి, ముత్తయ్య, లింగన్న వస్తారు.)

"చినబాబూ! చినబాబూ! (అనుకుంటూ దగ్గరికి పోతారు)

చంద్ర:- ఆఁ నా బిడ్డ నా పద్మ. నేను నమ్మలేను.

పెంట:- అది నీ తప్పు. నా తప్పుగాదు. నువ్వు నమ్మినా నమ్మకున్నా నీబిడ్డే.

లింగ:- అదేందే పెంటన్న, కమలమ్మగోర్ని సంపపోతవా?

పెంట:- అవును. ఇది సెంద్రమయ్యగారి బిడ్డ. కన్నబిడ్డ (పొడవబోవును)

చంద్ర:- ఆగు పెంటయ్యా, ఈ దెబ్బతో నీ ప్రాణం పోతుంది. నా ప్రాణాలిచ్చి అయినా నా బిడ్డను కాపాడుకుంటాను.

(అని కర్ర లేపబోగా)

పెంట:- నీ కర్ర నా నెత్తిల పడకముందే ఈ కత్తి నీ బిడ్డ గుండెల్ల దిగుద్ది. కర్ర కిందెయ్యి, ఉఁ ఏస్తవా, లేదా.

చంద్ర:- (కర్ర కిందపడేస్తాడు)

లింగ:- సూస్తవేందే ముత్తన్న. కానీయ్.

(అని కర్రలు లేపబోగా).

పెంట:- ఇంగో మీరు ఆపని సేస్తిరా ఈ కత్తి మీగుండెల్ల దిగుద్ది. (అని కత్తి చూపించును ముత్తన్న, లింగన్న ఆగిపోదురు)

(కమలను పొడవబోవును)

చంద్ర:- పెంటయ్యా! నా బిడ్డను చంపకు. ఎన్నో ఆశలు పెట్టుకొని బ్రతుకుతున్నాను. నీకేమి కావాలంటే అదిస్తాను. కోరుకో, డబ్బా, భూమా, ఏంకావాలి.

పెంట:- నాకేమొద్దు. నీ బిడ్డ పానం గావాలె,

(పొడవబోవగా శంకర్....)

శంక:- పెంటయ్యా, కత్తి కింద బడేయ్. ఉఁ....

పెంట:- (తనలో) సినబాబు బతికిండు. పడేస్త ఇంక నాకీ కత్తితోని ఏం పని లేదు.

(కత్తి కింద పడవేయును)

చంద్ర:- అమ్మా! అమ్మా! (అని దగ్గరకు పోయి) బ్రతికావా తల్లీ, నీ కొరకే నేను ఇన్ని రోజుల నుండీ ఎన్నో ఆశలు పెట్టుకుని బ్రతుకుతున్నాను.

కమల:- నాన్నా! (అని తలవంచుకుంటుంది)

చంద్ర:- క్షమించు తల్లీ నేను పాపాత్ముణ్ణి.

శంక:- ఏమిటి కమల చంద్రం మామయ్య కూతురా. ఆశ్చ ర్యంగా ఉన్నదే. ఇంకా నిలబడే ఉన్నావా పెంటయ్యా, వెళ్ళిపో, నువ్వు నా ముందు నుంచి వెళ్ళిపో, నీ ముఖం నాకెప్పుడూ చూపించకు.

**తెంట:-** పోతనుండీ సినబాబూ! పోత. నేను ఎందుకు ఇట్ల సేసిన్నో మీకేం తెలుసుండీ. నన్ను చంద్రమయ్య అన్ని విధాలా నాశనం చేసిండు. బతుకు దెరువుకు బస్తీకి బొయ్యి. కన్న బిడ్డను కొడుకునూ పొట్టల బెట్టుకున్న. ఒకనాడు నేను పోతుంటే రైలుపడ్డది. ననా మంది సచ్చిండ్రు. చంద్రమయ్యగారి భార్య మహాలచ్చమమ్మ, అన్నపూర్ణ సుంటి మడిసి, ఆమె గూడ కండ్లు మూసింది. పక్కన సిన్నపిల్ల ఏడు స్తుంటే గుర్తుబట్టి తీసుకున్న. ఇంతెల్లమే సెంద్ర మయ్య మమ్ములను బెట్టిన కష్టాలు యాదికొచ్చి నయి. రొండు కాల్లు బట్టి నేలకు గొడుదామని పయికెత్తిన గని. సేతులు రాలేదు. నాబిడ్డ కండ్లల్ల కనపడ్డది. సంపలేక, మా సుట్టపోనితోని, నాకు అనేక యిదాల సాయం సేసిన, బిడ్డలు లేక కష్ట పడుతున్న గోవిందయ్యగారితానికి పంపిన. ఆయిన కండ్ల కద్దుకోని సాదుకున్నడు. సెంద్రమయ్యతోని సెప్పుదామనిపిచ్చింది కాని, సెప్పితే తీసుకొచ్చు కుంటడు. ఏదిపిచ్చాలని కసి గూడ ఉండె. అందికే సెప్పలేదు. ఎక్కడ దిక్కు లేక మల్ల ఉన్నూరే సేరిన. నేను ఈ ఊరు వచ్చినప్పటి సంది, మీరు నన్ను నన్న కొడకోతుగ సూసుకున్నరు. నా కొడుకు మీద ఆశలన్ని మీమీదనే పెట్టుకొని సల్లంగ బతుకుతున్న ఇప్పుడు నేను వచ్చే వరకు మీరు పడి ఉన్నరు. సెంద్రమయ్య సావకొట్టిండని కోసమొచ్చి కమలమ్మను సంపి కోపం తీర్చు కుందామనుకున్న కని ఇంతెల్లమే మీరు కలిలిండ్రు, మాట్లాడిండ్రు. ఇంగ కమలమ్మను సంపాల్సిన అవసరం నాకు లేదని కత్తి కింద బడేసిన. అంతే. మీరు సల్లగ ఉంటే సాలు. నేను ఎక్కడనన్నా బతుకుత, పోతుండ.

(అని వెళ్ళబోవగా చంద్రం.....)

**చంద్ర:-** పెంటయ్యా: ఆగు. (అని దగ్గరకు పోయి) నీదేం తప్పు లేదు. పొరలు గమ్మిన నా కండ్లకు వెలుగు చూపించావు. నా బిడ్డను ఆరోజే చంపే వేస్తే నేను ఏమిచేసేవాణ్ణి. నీలో మానవత్వం ఉంది. అందుకే చంపలేదు. చంపడం నీ చేత కాదు. నన్ను క్షమించు పెంటయ్యా.

**పెంట:-** పెద్దలు అటనకురి సెమించేటందుకు నేనెంతటోన్ని.

**శంక:-** పెంటయ్యా. ఆలోచించకుండా నిన్ను ఎన్నో అన్నాను నన్నూ.... ...

**పెంట:-** అట్టనకురి సినబాబూ. అట్టనకురి. చంద్రమయ్య గారు నా ఆఖరి కోరిక ఒక్కటి తీర్సుతరా, ఎల్ల కాలం మీ కాళ్ళ దగ్గర పడుంట.

**చంద్ర:-** అట్లనకు పెంటయ్యా! కోరుకో, నా బిడ్డను నాకు ప్రసాదించిన దేవుడవు నువు! నీవు ఏది కోరు కుంటే అది ఇస్తాను.

**పెంట:-** నాకేమొద్దుండీ, మీ కమలమ్మగోరిని, మా సినబాబు కిచ్చి, ఎనకటి పగలు, ఇప్పటి పగలు మర్సిపోయి మీరు మీరు కలుసుంటె, అంతేచాలు.

**చంద్ర:-** తప్పకుండా. నీ కోరికే కాదు. నా కోరిక కూడా అదే. తొందరలో అన్నయ్యకు ఉత్తరం రాసి ఆయన సమక్షంలోనే చేస్తాను.

**పెంట:-** అంతే బాబు, అంతే .....

**ముత్త:-** పెంటయ్యంటే ఏమో అనుకున్నం! పెద్దగాల. ఒక్క దెబ్బకు రొండు కుటుంబాలను కలిపెనే, అసలు ఊరే ఒకటైందిప్పుడు

**చంద్ర:-** శంకర్, నన్ను క్షమించు, మిమ్ములను అనేక కష్టాలు పెట్టాను. వ్యతిరేకంగా నడిచాను.

**శంక;-** కాదు మామయ్యా. వ్యతిరేకతలోనే అభివృద్ధి వుంది. నువ్వు వ్యతిరేకంగా నడవడం వల్లనే మేము పట్టుదలతో పనిచేశాము.

(ఇంతలో కోటయ్య దూసుకువచ్చి)

**కోట:-** రామీ! రామీ! నన్నె దొంగు బుచ్చి నాటకమాడు తుండవా. కోటయ్యంటె ఏమనుకుంటుండవు డొక్క చించి డోలుగడ్త.

(అని కోటయ్య లక్ష్మిని కొట్టబోవగా, వెనుక నుండి కోటయ్య తలపైన భూషయ్య దెబ్బ కొట్తాడు.—కోటయ్య "అబ్బా" అని పడిపోవును)

**లక్ష్మి:-** (గబగబా వచ్చి) బావా! బావా! (అని గుడ్డ జించి కట్టు కట్టును. ఇంతలో భూషయ్య...)

**భూష:-** దెబ్బకు దెబ్బ. నీకే బలమున్నదనుకున్నావు? నీ కొరకు ఎన్ని దినాల నుంచి కాపాడుతున్న.

**శంక:-** భూషయ్యా, నువ్వాకొట్టింది. కోటయ్యని?

భూష:- అపునుండి అయ్యాల అన్నాలంగ నన్ను కొట్ట లేదుండి. ఇయ్యాల దొరికిందు బిడ్డడు

కమల:- ఆ రోజు కొట్టాడని ఈ రోజు కొడతావా? నీకు బుద్ధి లేదూ. బుద్ధిమంతుడవని పోస్టుపని కూడా ఇప్పించాం. నువ్వు మా దగ్గర ఇన్ని రోజులనుండి నేర్చుకుంది ఇదేనా? ఇక్కడనుంచి పో!

భూష:- తప్పేందుండీ తప్పేంది కోపం మీద కొట్టిన.

(ఇంతలో కోటయ్య లేచి కూర్చుంటాడు)

భూష:- కోటన్న, నన్ను సెమించు తప్పేంది. మా సిన బాబు మనసు నొప్పిచ్చిన. సెమించవు.

కోట:- ఎవరు చేసింది వారు అనుభగిస్తరు. దీంట్ల నీదేం తప్పులేదు.

లింగ:- రామి! రామనుకుంటా మన లచ్చిమి పానాలు దీస్తుండనె. ఉసూరుమంట.

లక్ష్మి:- రామి వేరు లక్ష్మి వేరుకాదు. నేనే రామిని. ఈ కోటయ్య భార్యను. చిన్నతనంలో నాకు పెండ్లైంది. అది నాకు సరిగ్గా జ్ఞాపకం లేదు. నాకంటే చిన్నది తోబుట్టువు ఉండేది. దాని పేరే లక్ష్మి. అకస్మాత్తుగా జబ్బు చేసి అది మరణించింది. ఆ రోజు నుంచి మా అమ్మ అప్పుడప్పుడూ లక్ష్మీ లక్ష్మీ అని నన్ను పిలిచేది. అలాగే నా పేరు లక్ష్మిగా మారింది. చిన్నతనంలోనే మా నాన్న చనిపోవడం జరిగింది, నాకు బుద్ధి తెలిసే వరకు అమ్మా నేను గోవిందయ్యగారి దగ్గర ఉన్నాము. కమలక్కను చూచేందుకని మా అమ్మను తీసుకొచ్చారుడట; గోవిందయ్యగారు. కమలక్క బలవంతం మీద గోవిందయ్యగారి దయవల్ల, ప్రభుత్వ సహాయం వల్ల నేను చదువుకోవడం జరిగింది.

కమల:- నేను బి.ఏ. పూర్తి చేసుకునే వరకే లక్ష్మి మెట్రిక్యులేషన్ పూర్తి చేసింది. తరువాత........

లక్ష్మి:- కమలక్క ప్రాతిపదిక విద్యా ప్రచారకురాలుగా, నేను గ్రామ సేవికగా శిక్షణ పొందాము. ఈ ప్రాంతానికి మేము రావాల్సి వచ్చింది. నేను కూడా సంతోషంతో అంగీకరించాను. మా బావ ఎలాంటి పరిస్థితుల్లో ఉన్నాడో చూద్దామని. నేను మొదట గ్రామంలో అడుగు పెట్టగానే, మా బావే నన్ను మందలించాడు. ఎలాగైనా ఇతన్ని బాగు చేద్దామని ప్రయత్నించాను కాని ప్రయోజనం కలుగలేదు. మా గ్రామం వరకూ పోయి నేనే ఆయన భార్యనని తెలుసుకొని నన్ను మోసం చేస్తావా అని కోపంతో నన్ను కొట్టబోయాడు. ఇది రామి కథ.

శంక:- ఆశ్చర్యంగా ఉందే.

ముత్త:- కమలమ్మ గోరేమో సెంద్రమయ్యగారి బిడ్డ. లచ్చిమేమో కోటయ్య భార్య.

శంక:- ప్రభుత్వం వైపున బయలుదేరిన వారూ మొదటే చెప్పలేదే. దాచుకోవలసిన అవసరం ఏమొచ్చింది.

కమల:- ప్రజల్లో ప్రభుత్వ ఉద్యోగులనే వరకే ఏదో అభిప్రాయం ఏర్పడి దూర దూరంగా పోతుంటారు.

లింగ:- మాతోని మీ వోతుగ కలిసి పనిజేస్తె ఎందుకు పోతం? మీరు దూరంగ పోతె, మేము దూరంగ పోతం.

కమల:- అందుకే అలా చెప్పకుండానే ఇలా రంగంలోకి దిగాం.

శంక:- ప్రభుత్వ ఉద్యోగులందరు గూడా మీ వలె ప్రభుత్వం వేరు, ప్రజలు వేరు కారనే దృష్టిని కలిగించి కృషి చేస్తే దేశం ఎంతో తొందరలో అభివృద్ధికి వస్తుందని ముమ్మాటికి నమ్మవచ్చును.

(ఇంతలో కోటయ్య వెళ్లిపోతుంటాడు)

లక్ష్మి:- బావా! బావా!

కమల:- కోటయ్యా! ఎక్కడికీ పొయ్యేది?

కోట:- దేశమ్మీన రామి వేరు, లచ్చిమి వేరు. ఇంత సదువుకోని గూడా నాకాడికొస్తే తెలుసుకోలేకపోయిన. ఎన్నో అన్న, పానంగూడ తీసెటందుకు తయారయిన. నేను దాని ముందల నిలబడెటందుకు గూడ తగనుండి, తగను. పొట్ట చీల్చినా ఒక్క అచ్చరం ముక్క గూడ రాదాయె నాకు.

శంక:- పిచ్చివాడా, ఇప్పుడు నువ్వు మాత్రం చదువుకుంటే చదువురాదా, ఒక్క సంవత్సరంలో లక్ష్మి కంటే ఎక్కువ చదువు వస్తుంది.

వెంట:- ఇప్పుడు మేమందరం బాగోతం ఎల్లసదువుతుండం.

లింగ:- అబద్ధమెందుకు ఆ_ద్దవే. బాగోతం సదువుతుండాం.

ముత్త:- ఇయ్యాల గాకపోతే రేపు సదవమా, అందరు పుట్టంగనే నేర్సింద్రా.

పెంట:- అరీ! నీకొరకు ఎన్నొ కష్టాలు పడి ఇంత దూరం వెతుక్కుంట వస్తె నువ్వేమో పారిపోతుండావు?

ముత్త:- ఇంకేడికి పోతడు?

కోట:- మీ అందర్ని కష్టపెట్టిన,! అందర్ని ఎన్నో మాట లన్న. ఈ బతుకు బతికెందుకే, సావకా.

(వెళ్ళిపోబోవును)

లింగ:- ఇంకా బెదిరిస్తవేందారి. నువ్వు ఎంత సెడ్డోనివో అంత మంచోనివి. ఎనకటి ముచ్చటంత మర్సిపో. అందరం కలిసి ఉందాం. తప్పు సేసిన్నమనుకుంటె సరిపాయె.

ముత్త:- లచ్చిమంటే నిజంగ లచ్చిమే. తన ఇల్లు సక్క పెట్టుకొంది, మా ఇండ్లల్ల దీపం పెట్టింది.

లక్ష్మి:- అందరి ఇండ్లల్లో దీపం పెట్టింది కమలక్క.

పెంట:- ఉన్నమాటన్నవు నీ కడుపు సల్లగుండ.

కమల:- ఈ కథకి మూల పురుషుడు చినబాబు.

లింగ:- అంతే. అంతే. అందర్ని గలిపింది పెంటయ్య.

పెంట:- మీరు మాత్రం తక్కువోల్ల.

చంద్ర:- అందరూ అందరే.

శంక:- ఈ శుభ సమయంలో ఈ రోజునుంచి నా ఆస్తి పూర్తిగ ప్రజలపరం. అంటే గ్రామపరం చేస్తు న్నాను.

కమల:- మా నాన్నగారి నుండి నాకు లభించిన ఆస్తికూడా గ్రామ పరం చేస్తున్నాను.

లింగ:- మాకున్నది గూడ దాంట్లనె కలుపురి.

ముత్త:- నీకున్న దేందె కలిపెటందుకు?

శంక:- భేష్. ఉండేదేంది కలిసి బ్రతుకటానికి, ఇప్పటి నుంచి మన గ్రామంలో హెచ్చు, తగ్గులు, బీదా బిక్కా, అనే భేదం లేదు. అందరం అన్నదమ్ములం.

శంక:- అన్నదమ్ముల వలె అందరం.........

అందరు:- కలిసి బ్రతుకుదాం.

శంక:- భేదభావాలు లేకుండా. .....

అందరు:- కలిసి బ్రతుకుదాం.

కమల:- గ్రామం......

అందరు:- అందరిది.

శంక:- గ్రామంలో ఉన్నటువంటి ఆస్తంతా.......

అందరు:- గ్రామ ప్రజలది.

శంక:- అన్నదమ్ములవలె అందరం.........

అందరు:- కలసి బ్రతుకుదాం.

ముత్త:- ఏముంది, ఆ లిద్దరు కలిసిపోయిరి. ఇంక రేపటి ఉత్సవంలనే సినబాబు, కమలమ్మగోరి పెండ్లి చేసెయ్యరాదురి.

లింగ:- గోవిందయ్యగారికి ఓ ఉత్తరం ముక్క రాసెయ్య రుండీ బిరాన రమ్మనీ.

చంద్ర:- అలాగే.

(అందరూ పోబోదురు)

లింగ:- ఆగురాగురి. పెండ్లిండ్లు అయినంక పెండ్లాం మొగలు సరసం ఆడుకుంట ఎట్ల గమ్మత్తున ఉండా లంటవురా ముత్తన్న.

ముత్త:- పాట పాడి ఇనిపిద్దాం పటు.

లింగ:- నువ్వు ఆడేసెం ఏస్తవా? మొగేసమా?

ముత్త:- నేను నీకంటె ఎత్తులేనూ, మొగేసమే ఏస్త.

లింగ:- అయితే కానీ........

దర్వు—త్రిశ్రగతి

ముత్త:- అంటె ఆగవు గాని కొడితె కోపము గాని కొప్పునున్నా పూలు ఎక్కడివె భామా.
హత్తెరీ పూలు ఎక్కడివె భామా.

లింగ:- గాలొచ్చి దూలొచ్చి గంపంత మబ్బొచ్చి
కొమ్మ ఊగి కొప్పు నిండింది బావా,

ముత్త:- అంటె ఆగవుగాని కొడితె కోపముగాని
కొంగునున్నా దుమ్ము ఎక్కడిదె భామా
హత్తెరీ దుమ్ము ఎక్కడిదె భామా.

లింగ:- కాపోరి ఇంటికీ పాలకని నే బోతె
కట్టె కోడె కాలు దువ్వింది బావా
కట్టె కోడె కాలు దువ్వింది బావ.

ముత్త;- అంటె ఆగవుగాని కొడితె కోపము గాని
చెంపనున్నా కాట్లు ఎక్కడివె భామా
హ త్తెరి కాట్లు ఎక్కడివె భామా.

లింగ;- కోమటోరింటికి కొబ్బరాకనిపోతే
తక్కెట్ల గుండొచ్చి తగిలింది బావా
తక్కెట్ల గుండొచ్చి తగిలింది బావా.

ముత్త;- అంటె ఆగవుగాని కొడితె కోపముగాని
మంచము కింది వాడు ఎవ్వాడె భామా
హత్తెరి వాడెవ్వడే భామా.

లింగ;- అల్లిబిల్లీగాడూ ఆవులమందాగాడు
పిల్లికి తలనొస్తే నల్లీకొచ్చాడా
పిల్లికి తలనొస్తే నల్లీ కొచ్చాడా.

(అందరు చప్పట్లు కొడుతుండగా తెర పడుతుంది)

(సమాప్తం.)

---

అంతా అందలం ఎక్కితే మోసేవారెవరు?

* * *

డబ్బున్నవాళ్లకి అంతా చుట్టాలే.

* * *

అప్పుచేసి పరమాన్నం తినేకంటే అప్పు లేకుండా గంజి త్రాగటం మేలు.

* * *

గడియారం జేబులో పెట్టుకున్నట్లు విజ్ఞానాన్ని భద్రంగా దాచుకో. ఉన్నదని చూపటానికి బైటికి తీసి ప్రదర్శించటం తప్పు.

— లార్డ్ చెస్టర్ ఫీల్డ్.

# తోలు బొమ్మలాటలు

— శ్రీ మ. వేం. రమణమూర్తి

కొన్ని శతాబ్దాలకు పూర్వం మహారాష్ట్ర దేశం నుండి కొంత మంది కళాకారులు అక్కడ భుక్తి గడవకనో మరేకారణంచేతనో ఆంధ్రదేశం తరలి వచ్చారు. ఆవిధంగా వచ్చిన తొలిజట్టు నివాసంగా ఏర్పరచుకున్నది బళ్ళారి జిల్లాలోని 'బొమ్మలాటపల్లి'. ఆంధ్రదేశంలో వారు ఆంధ్రుల ఆదరాభిమానాలను చూరగొన్నారు. వీరు మొదట్లో ఆడించేవి అట్టబొమ్మలు. తెల్లటి తెరపై నల్లటి నీడలు పడేవి. కాని క్రమేణా అట్టబొమ్మలు పోయి రంగురంగుల తోలుబొమ్మలు వచ్చినవి. అట్ట బొమ్మల కాలంలో యీ ఆటలను 'కీలు బొమ్మలాట' లు అనేవారు. బొమ్మయొక్క యే కీలు కా కీలు ఆడుతుంది కనుక వాటికా పేరు వచ్చింది. బొమ్మలు తోలుతో చేయడం మొదలు పెట్టినప్పటి నుంచి యీ ఆటలను 'తోలుబొమ్మలాట'లనడం మొదలుపెట్టారు మలయా, ఇండొనీషియా, బర్మా, జావా, సుమత్రా మొదలైన అనేక దేశాలకు మన హిందూదేశం నుంచి ముఖ్యంగా ఆంధ్ర దేశం నుంచి ఈ కళ ప్రాకింది. రోజు రోజుకీ ప్రపంచం యొక్క జనాభా పెరుగుతున్నట్లే మరాఠీ జట్టు వారి సంతతీ పెరిగింది. కాలక్రమేణా ఒక జట్టు రెండు, రెండు నాలుగుగా పెరగడం మొదలుపెట్టాయి. ఈ విధంగా పెరిగిన జట్టులు ఒక్కచోట గడువక జిల్లా జిల్లాకు మొత్తం ఆంధ్ర దేశం అంతా ప్రాకాయి. కొంత కొంత మంది కొన్ని కొన్ని జిల్లాలలో, నివాసాలేర్పరచుకొని స్థిరపడ్డారు. ఈ విధంగా యీనాడు ప్రతి జిల్లాలోను ఏదో గ్రామంలో ఈ జట్టులున్నాయి.

తోలుబొమ్మలు ఎలా ఆడిస్తారు? వీరు ప్రదర్శించేవి రామాయణ, భారత, భాగవత, పురాణ గాధలు. అందుచేత కథకు సంబంధించిన మనుష్య పాత్రలు, జంతువుల పాత్రలు కల బొమ్మలను తోలును 'మైకా' వలె నీడ కనిపించునట్లు పలుచగా శుభ్రము చేసి, కత్తిరించి, రంగులు వేసి, కీళ్ళవద్ద చలనం కలిగేలాగు దారాలతో కట్టి, ఏర్పాటు చేస్తారు. ఉత్తరాది బొమ్మలాట వారు బొమ్మలను దారములతో ఆడిస్తారు. ఆ బొమ్మలు బొమ్మలుగానే మనకు కనిపిస్తాయి. కాని మన తోలు బొమ్మలవలె నీడ కాదు. ఒక యీత బద్దను మధ్యకు చీల్చి (రెండు బద్దలుగా) తలనుండి తుంటి వద్దకు తోలు బొమ్మకు మధ్యలో దూర్చి దారముతో వూడిపోకుండా గట్టిగా కడతారు. తుంటి వద్ద యీ యీత బద్ద కొన కొంచం క్రిందికి దిగి ఉంటుంది. ఈ కొసను చేతితో పట్టుకొని బొమ్మనూ, రెండవ చేతితో వెదురు బెత్తమును బొమ్మ చేతి వ్రేళ్ళ మధ్య రంధ్రములోనికి దూర్చి బొమ్మ చేతిని కదుపుతూ ఆడిస్తారు. వెదురు బెత్తముకు చిన్న పుల్ల ముక్కను అంగుళము పొడవుగల దారముతో వ్రేలాడునట్లుకట్టి ఆ చిన్నపుల్లను బొమ్మ చేతిలోని రంధ్రములోనికి దూర్చుతారు. దానివలన బొమ్మ చేతిని బెత్తము పట్టుకొనును. ఆ బెత్తము యొక్క రెండవ కొనను ఆటగాండ్రు చేతితో పట్టుకొని బొమ్మను ఆడిస్తారు. ఈ బొమ్మలను తెల్లటి తెరపై ఆడిస్తారు. తెరకు దగ్గరలో, లోని కళాకారులు కాని, వారి నీడలు కాని సాధ్యమైనంత వరకు కనిపించకుండా అమర్చబడతాయి. అందుచేత కేవలం బొమ్మల నీడలనే ప్రేక్షకులు చూస్తారు.

ఈ బొమ్మలకు లేడి, దుప్పి, గొఱ్ఱె, మేక చర్మములనే వాడుతారు. లేడి, దుప్పి చర్మములు దేవతా విగ్రహములకు, గొఱ్ఱె, మేక చర్మములు తక్కువ జాతికి చెందిన విగ్రహములకు ఉపయోగించే వారు. ఈ చర్మములను సాపు చేయుటలో (Transperent గా) చాలా పని వానితనముంది. బొమ్మకు రెండు వైపులా వీసమెత్తు తేడా లేకుండా రంగులు

వేస్తారు. బొమ్మలకు చంద్రాలు పొడవడం వల్ల బొమ్మలు నిజమైన ఆభరణాలు, నిజమైన దుస్తులు ధరించినట్టే వుంటుంది.

ఈ బొమ్మలు యీ ఆటగాండ్రకు పెద్ద సంపద. వాటిని వివాహములలో కట్నకానుకలుగాను, ఆస్తిపంపకములలోను పాటిస్తారు.

ఈ బొమ్మలాట జట్టుల వారు వారి కుటుంబాలతో ఒక గ్రామం నుంచి మరో గ్రామానికి ప్రదర్శననిస్తూ తిరుగుతూండే వారు. రాత్రిపూట ప్రదర్శనలిస్తూన్నా, పగటిపూట మగవారు మకాంలో కూర్చుండి క్రొత్త బొమ్మలను తయారు చేస్తూండే వారు. ఆడవాళ్లు ఇంటింటికి మెడలో శృతి పెట్టె వేసుకొని పాడుతూ, బియ్యము, పప్పులు, కూరలు, పచ్చళ్లు, ఒకటేమిటి? ఏమి దొరికితే అది దండి తీసుకు వచ్చే వారు. ఈ విధంగా దండటానికి వెళ్ళడం ఆ రోజుల్లో ఒక రకమైన ఆదాయమే కాకుండా ఖర్చులేని ప్రచారం (Publicity) కూడా వీరు గుమ్మ గుమ్మానికి వెళ్లి పాడుతుంటే, తోలు బొమ్మల వాళ్ళు ఊర్లోకి వచ్చారని, ఫలానా చోట వున్నారని. యీరోజు ఎక్కడో ఓచోట ప్రదర్శన వుందని ప్రజలకు ఆనవాలై పోతుంది.

చక్రవర్తుల పాలనలో కలకలలాడిన మన భారత కళా లక్ష్మి ఆంగ్ల పరిపాలనాంతముతో సంకెళ్ళు విదిలించుకొని మళ్ళీ మన భారత జాతీయ ప్రభుత్వం చేతిలో ఆరోగ్యాన్ని కోలుకుంటూంది. మన ప్రాచీన ఆంధ్ర కళా లక్ష్మి మన తెలుగు వాకిట మళ్ళీ కలకలలాడటం మనం చూడగలమని ఆశ. మన కళాకారులు మనకు దక్కగలరనే ఆశకూడా లభిస్తోంది ఏమైనా యీ ప్రజాయుగంలో కళలకు పునర్జన్మ నిచ్చి తెలుగు నాట మూడు మొగ్గలు ఆరు కాయలు తొడిగించి కలకలలాడేలాగు చేయవలసిన బాధ్యత మన ప్రభుత్వం కంటే మన ఆంధ్ర ప్రజానీకం మీదే ఎక్కువ వుంది.



అత్త లేని కోడలు ఉత్తమురాలు, కోడలు లేని అత్త గుణవంతురాలు.

*   *   *

అంత్య నిష్ఠూరం కంటె ఆది నిష్ఠూరం మేలు.

*   *

చిన్న పామైనా పెద్ద కర్రతో కొట్టాలి.

*   *   *

ఆకలి రుచి యెరుగదు. నిద్ర సుఖ మెరుగదు. సుఖం సిగ్గెరుగదు.

# ప్రకాశికా గీతం

— శ్రీ చెఱుకుమిల్లి భాస్కరరావు

పల్లవి: లేరా, భారత వీరా, వేడుక మీరా, తెలియర ఇది యేమో,
అందఱికీ ఆనందము నిచ్చే సుందర స్వప్నము అగునేమో

అనుపల్లవి: ఇదియే భారత రాజ్యాంగమునకు రచియించిన ఒక యోజనగా
ఇది అయిదేండ్లకు ఆనందముతో అమరించిన ఒక సాధనగా

చరణము: 1.
పంటలు పండని బంజరు భూముల
బంగరు చేలుగ చేయుగదా !
కంటక యుతమగు కంకర బాటను
కన్నుల పండువ చేయుగదా !
ఆకలి దప్పుల తీర్చుట కొఱకై
అహరహములు కృషి చేయుగదా !
అన్నము వస్త్రము అందఱి కొసగుట
ఆశయముగ తల పోయు గదా !

॥ఇదియే॥ ॥లేరా॥

చరణము: 2.
రహదారుల నిర్మాణము కాగా
రైలు మార్గములు రాగా,
బహు ముఖముల మన దేశ వర్తకము
పలు దేశములకు పోగా,
గ్రామ సీమలకు నూతన తేజము
రామణీయకత రాగా,
ప్రేముడితో మన దేశ నాయకులు
ప్రాభవమును కొనితేగా ॥

॥ఇదియే॥ ॥లేరా॥

ఆంధ్ర ప్రదేశ్

చరణము: 3.

దక్షిణమున నాగార్జున సాగరు
సాగరముగ కనిపించు గదా!
లక్షల కొలదిగ చేలను తడుపుచు
రక్షణమును కలిపించు గదా!
విద్యుచ్ఛక్తిని విడుదల చేయుచు
విస్తృత సుఖ మొనరించు గదా!
విశ్వ ఖ్యాతిని సము పార్జించుచు
విస్మయ వరమలరించు గదా॥

॥ఇదియే॥ ॥లేరా॥



క్రొత్తను కొందరు చులకన చేసి మాట్లాడుతారు. లేకుంటే అడుగుతారుగదా "యీ క్రొత్తను మీ రెందుకు స్వీకరించరు"? అని!

— హెచ్. జి. వెల్స్.

* * *

పిరికివాళ్ళెన్నటికీ నైతికంగా ప్రవర్తించలేరు.

— మహాత్మాగాంధి.

* * *

నిజమయిన హాస్యానికి జన్మస్థానం మెదడు కాక హృదయమే. అందులో అవహేళన లేదు. దాని సారం ప్రేమ. అది వెడనవ్వులో కాక హృదయాంతర్గతమయిన నిశ్శబ్దమయిన చిరునవ్వులలో ఉంటుంది.

— కార్లైలు

# జిల్లాల వార్తలు

## ఆదిలాబాదు

గ్రామ సహాయకుల శిక్షణా శిబిరం:- మథోల్ పంచాయతీ సమితి బ్లాకులోని తిమ్మాపూర్ గ్రామంలో 1959 డిసెంబర్ 20 నుంచి 22 వ తేదీ వరకు గ్రామ సహాయకుల శిక్షణా శిబిరం ఒకటి నిర్వహించబడింది.

నీటి పారుదల ద్వారా ప్రత్తి సాగు:- ప్రత్తికి "ఎ.జి." గుర్తు వేసే పద్ధతి ఆంధ్రప్రదేశ్‌లో మొట్టమొదటిసారిగా ఈ జిల్లాలోని మథోల్ బ్లాకులో అవలంబించబడింది. నీటి పారుదల ద్వారా ప్రత్తిని పండించే విధానం తెలంగాణాలో ప్రప్రథమంగా ఈ బ్లాకులోనే అమలుపరచబడింది. ఈ ప్రయోగం బాగా విజయవంతమైనది. చాలా మంది ఈ పద్ధతిని అనుసరిస్తున్నారు.

సాముదాయక రేడియో సెట్టులు:- మథోల్ బ్లాకులో 1959 వ సం.లో 10 సాముదాయక రేడియో సెట్టులు నెలకొల్పబడినవి. సెట్టుల స్థాపనకై ప్రజల నుంచి విరాళంగా రూ. 2500 ల మొత్తం సేకరించబడింది.

ఆరోగ్య కేంద్రానికి గ్రామస్థుల విరాళం:- మథోల్ బ్లాకులోని కుబీర్ గ్రామంలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రం ఒకటి తెరవబడుతుంది. దీని నిర్మాణానికి రూ. 10,000 ల మొత్తాన్ని ప్రజలు విరాళంగా ఇచ్చారు. కేంద్రం స్థాపనకు రూ. 40,000 లు అవుతుంది.

## అనంతపురం

పారిశ్రామిక ప్రదర్శనం:- అనంతపురంలో 1959 డిసెంబర్ 5 నుంచి 15వ తేదీ వరకు పారిశ్రామిక వస్తు ప్రదర్శనం ఒకటి నిర్వహింపబడింది. జిల్లాలోని బ్లాకులూ, ప్రభుత్వ శాఖలు, రెండవ ప్రణాళిక క్రింద జరుగుతున్న అభివృద్ధి కార్యకలాపాల ప్రగతిని వివరించే అనేక ప్రదర్శన వస్తువులను దీనిలో ప్రదర్శించాయి.

కుటుంబ నియంత్రణ దినోత్సవం:- అనంతపురంలో 1959 డిసెంబర్ 18 వ తేదీన కుటుంబ నియంత్రణ దినోత్సవం జరుపబడింది. జిల్లా ఆసుపత్రిలో ఇప్పటి వరకు సుమారు 1500 మందికి కుటుంబ నియంత్రణ పద్ధతుల గురించి తెలియజెప్పబడినదని జిల్లా ఆరోగ్యాధికారి తెలిపారు.

## చిత్తూరు

పల్లిపట్టు సమితి:- పల్లిపట్టు పంచాయతీ సమితికి 4-12-1959 వ తేదీన ప్రారంభోత్సవం జరిగింది.

రామసముద్రం గ్రామంలో 19-12-1959వ తేదీన వయోజన విద్యా కేంద్రం ఒకటి తెరువబడింది.

## గుంటూరు

ఈమని పంచాయతీ సమితి:- ఆంధ్రప్రదేశ్ గవర్నర్ 1959 నవంబర్ నెలలో తమ గుంటూరు జిల్లా పర్యటన సందర్భంలో ఈమని పంచాయతీ సమితికి ప్రారంభోత్సవం చేశారు.

అంబర్ చరఖా శిక్షణా కేంద్రం:- మంగళగిరి బ్లాకులోని చిర్రావూరు గ్రామంలో 1959 నవంబర్ 16 వ తేదీన అంబర్ చరఖా శిక్షణ కేంద్రం ఒకటి తెరవబడింది.

గ్రామ సహాయకుల శిక్షణా శిబిరం:-తాడేపల్లిలో 1959 నవంబర్ 30 నుంచి డిసెంబర్ 2 వ తేదీ వరకు గ్రామ సహాయకుల శిక్షణా శిబిరం నిర్వహింపబడింది, 55 మందికి శిక్షణ ఇవ్వబడింది.

## కృష్ణా

చిన్న మొత్తాల పొదుపు:- నందిగామ బ్లాకులో 1959 డిసెంబర్ 8 నుంచి 13వ తేదీ వరకు చిన్న మొత్తాల పొదుపుకి పెట్టుబళ్ళుగా రూ. 3050 ల మొత్తం సేకరింపబడింది.

హరిజన దినోత్సవం:- చింతలపల్లిలో 1959 డిసెంబర్ 30 వ తేదీన హరిజన దినోత్సవం జరుపబడింది. ఈ సందర్భంలో పారిశుద్ధ్యపు కార్యక్రమం నిర్వహింపబడింది.

ప్రణాళికా దినోత్సవాలు:- విశ్వవిద్యాలయ ప్రణాళికా గోష్ఠి సంఘం అధ్వర్యాన విజయవాడ, ఎస్.ఆర్.ఆర్., సి.వి.ఆర్. ప్రభుత్వ కళాశాలలో 1959 సెప్టెంబర్ 8 నుంచి 10 వ తేదీ వరకు జాతీయ ప్రణాళికా దినోత్సవాలు జరుపబడినవి.

జిల్లా పరిషత్తు ప్రారంభోత్సవం:- కృష్ణాజిల్లా పరిషత్తుకి 1959 డిసెంబర్ 2 వ తేదీన రాష్ట్ర విద్య, సమాచార శాఖా మంత్రి ప్రారంభోత్సవం చేశారు. గాంధీజీ కలలుగన్న గ్రామ రాజ్యం ఇప్పుడిప్పుడే అవతరిస్తున్నదని మంత్రిగారు తమ ప్రారంభోపన్యాసంలో అన్నారు. పరిషత్తు సభ్యులు పూర్వపు విభేదాలన్నింటినీ విడిచిపెట్టి కలిసికట్టుగా కృషి చేయగలరని ఆయన ఆశాభావం వెల్లడించారు.

## కర్నూలు

బాలల దినోత్సవం:- నంజమలలో 14-11-59 వ తేదీన బాలల దినోత్సవం వైభవంగా జరుపబడింది. నూత్న వస్త్రాలు, పాలపొడి, బిస్కెట్లు ఈ సందర్భంలో పిల్లలకు పంచిపెట్టబడినవి.

## మహబూబ్‌నగరం

కొల్లాపూర్ పంచాయతీ సమితి:- రాష్ట్ర రెవెన్యూ శాఖా మంత్రి 11-12-59 వ తేదీన కొల్లాపూర్ మొదటి అంచె బ్లాకు పంచాయతీ సమితికి ప్రారంభోత్సవం చేస్తూ అధికాహారోత్పత్తిని సాధించుటకై కృషి చేయడమే సమితుల ప్రధాన కర్తవ్యమని అన్నారు. బ్లాకు వ్యవహారాల నిర్వహణలో రాజకీయాల జోక్యం వుండకూడదని కూడా ఆయన అభిప్రాయపడ్డారు.

ప్రపంచ వ్యవసాయ ప్రదర్శన సందర్శనకై రైతుల ప్రయాణం:- ఢిల్లీలో జరుగుతున్న ప్రపంచ వ్యవసాయ ప్రదర్శనాన్ని సందర్శించడానికై 64మంది రైతులతో కూడుకున్న ఒక బృందాన్ని పంపించడానికి ఇటీవల జరిగిన ఈ జిల్లా పరిషత్తు సమావేశంలో నిర్ణయింపబడింది. ఈ బృందం వెంట వెళ్లడానికి అచ్చంపేట బి. డి. ఒ., కల్వకుర్తి సమితి బ్లాకు వ్యవసాయ విస్తరణాధికారి ఇంకా అయిదుగురు గ్రామ సేవకులు కూడా ఎన్నిక చేయబడినారు.

మారుమూల గ్రామానికి రోడ్డు:- అమరాబాదు నుంచి ఇప్పలపల్లి వరకు ఒక రోడ్డును నిర్మించే నిమిత్తం రూ. 25,000ల విరాళం ఇవ్వడానికి పద్ర, వెంకటేశ్వరం, ఉడ్మిల్ల, మరాడె, ఇప్పలపల్లి గ్రామాల రైతులు వాగ్దానం చేశారు. ఇప్పలపల్లి ఈ జిల్లాలోని మిక్కిలి మారుమూల గ్రామం. ఈ గ్రామం రోడ్డుకి 24 మైళ్ళ దూరంలో వుంది

పశు వైద్యశాలలకై భవనాలు:- మహబూబ్‌నగరం, వనపర్తి పట్టణాలలో పశు వైద్యశాలల కొరకు భవనాల నిర్మాణాన్ని రాష్ట్ర ప్రభుత్వం మంజూరు చేసింది. వీటితో పాటు అంబగడ్, మరికల్‌లలో రెండు చిన్న పశు చికిత్సా కేంద్రాలనూ, మక్తల్, నాగర్‌కర్నూలులలో రెండు స్టేషనరీ పశు చికిత్సా కేంద్రాలను నెలకొల్పడానికి కూడా మంజూరీ ఇవ్వడమైనది.

జిల్లా సమాచార కేంద్రం:- మహబూబ్‌నగరం కేంద్ర గ్రంథాలయంలో త్వరలో జిల్లా సమాచార కేంద్రం ఒకటి స్థాపించబడనున్నది. ఈ కేంద్రంలో మేలిరకం విత్తనాలు, ఎరువులు మొదలైన వాటి నమూనాలతో పాటు జిల్లాలో ప్రణాళికా పథకాల క్రింద సాధించబడిన అభివృద్ధిని వివరించే చిత్ర పటాలు మొదలైనవి కూడా ప్రదర్శింపబడతాయి.

చెరువుల మరమ్మతు:- రెండవ ప్రణాళికా కార్యక్రమంలో చేర్చబడిన ఈ క్రింది పనులు మంజూరు చేయబడినవి.

గద్వాల తాలూకాలోని మోదులబండ సాకమ్మ చెరువుకీ, కొల్లాపూర్ తాలూకాలోని జమ్మాపూర్ బాపని కుంటకీ, ఉప్పేరపల్లిలోని పెద్ద చెరువుకి మరమ్మతులు. ఈ పనులన్నీ కూడా అమలుపరచబడడానికై నిర్వాహకులకు అప్పగించబడినవి.

మక్తల్ తాలూకాలో విత్తనాల స్టోరు నొకదానిని నిర్మించడానికి గాను రూ. 9,200 లమొత్తం మంజూరు చేయబడింది.

దేవరకదర బ్లాకుకై రూ. 12 లక్షల ప్రణాళిక:- దేవరకదర పంచాయతీ సమితి బ్లాకులో ఈ సంవత్సరంలో వివిధ అభివృద్ధి కార్యక్రమాల నిర్వహణకై దాదాపు రూ.12 లక్షల మొత్తం కేటాయింపబడినది. ఇది రెండవ ప్రణాళిక క్రింద ఈ సంవత్సరంలో ఈ బ్లాకు మొత్తం వ్యయం.

రహదారి సౌకర్యాలకై రూ. 4.2 లక్షలు ఖర్చుపెట్ట బడతాయి. సహకార సంఘాలకు స్వల్ప కాలిక ఋణాలకై రూ. 2.40 లక్షలు కేటాయించబడినవి.

## మెదక్

**జోగిపేటలో ఆరుబయలు రంగస్థలం:-** జోగిపేట పంచాయతీ సమితిచే నిర్మించబడిన ఆరుబయలు రంగస్థలానికి పరిశ్రమలు, ధర్మాదాయాల శాఖా మంత్రి 1959 డిసెంబర్ 20 వ తేదీన ప్రారంభోత్సవం చేశారు.

**పాఠశాలా భవనం ప్రారంభోత్సవం:-** పటన్‌చెరువు పంచాయతీ సమితి బ్లాకులోని ముబారక్‌పూర్‌లో పాఠశాల భవనానికి రాష్ట్రీ నీటిపారుదల, విద్యుచ్ఛక్తి శాఖా మంత్రి 14-12-59 వ తేదీన ప్రారంభోత్సవం చేశారు. దారిద్ర్యం, నిరక్షరాస్యతల నిర్మూలనకై నిస్వార్థమైన కృషి గట్టిగా జరగవలసిన అవసరమున్నదని ఆయన తమ ప్రసంగంలో అన్నారు. రూ. 7,500 ల వ్యయంతో ఈ భవనం నిర్మించబడింది. ఈ వ్యయంలో 4.500 ల మొత్తాన్ని ప్రజలు భరించారు.

## నల్లగొండ

**శ్రమదానం ద్వారా కాలువల నిర్మాణం:-** నల్లగొండ పూర్వవిస్తరణ బ్లాకులోని గూడాపురం, నిర్సన్మెట్ల గ్రామాల ప్రజలు, గూడాపురం చెరువు నుంచి నీటిపారుదల చేసే రెండు కాలువలను త్రవ్వారు. ఈ పనంతా కూడా ప్రజల శ్రమదానం ద్వారానే జరిగింది. నిర్సన్మెట్లకు చెందిన సుమారు 40 మంది హరిజనులు అక్కడికి దగ్గరలోనున్న నది నుంచి 1½ మైళ్ళ పొడవున, మరొక కాలువను కూడా త్రవ్వారు. సుమారు 200 ఎకరాలకు నీటిపారుదల చేయగల ఈ మూడు కాలువలూ ఎట్టి ప్రభుత్వ సహాయం లేకుండానే నిర్మించబడినవి. వీటి త్రవ్వకానికి రూ. 8000 ల వ్యయమయిందని అంచనా.

**గురిజాలలో యువజనుల క్లబ్బు:-** నల్లగొండ జిల్లా పరిషత్తు అధ్యక్షుడు శ్రీ జి.ఎస్. రెడ్డి 1959 డిసెంబరు 21వ తేదీన నకిరెకల్ బ్లాకులోని గురిజాలగ్రామంలో యువజనుల క్లబ్బుకి ప్రారంభోత్సవం చేశారు. ఈ జిల్లాలో తమ పర్యటన సందర్భంలో శ్రీ రెడ్డి శాలిగోవరం గ్రామంలో కూడా ఒక క్లబ్బుని (యువజనుల) ప్రారంభించారు.

**పశుప్రదర్శనం:-** పశుపోషణ శాఖ అధ్వర్యాన ముంగోడు గ్రామంలో పశుప్రదర్శనం జరుపబడింది. ఒకేరోజు జరిగిన ఈ ప్రదర్శనంలో అన్ని జాతులకు చెందిన 400 పశువులు ప్రదర్శింపబడినవి. వీటిలో ఉత్తమమైనవిగా ఎంచబడిన 50 పశువులకు బహుమతులు ఇవ్వబడినవి. ఈ ప్రాంతంలో ఇటువంటి ప్రదర్శన జరగడం ఇదే మొదలు. ప్రదర్శనాన్ని రైతులు, ప్రజలు అత్యధిక సంఖ్యలో సందర్శించారు.

**పార్కు ప్రారంభోత్సవం:-** రాష్ట్రీ కార్మికశాఖా మంత్రి నడిగూడెం గ్రామంలో ఒక పార్కుకి ప్రారంభోత్సవం చేశారు.

**గ్రామ సహాయకుల శిక్షణా శిబిరం:-** నారాయణపురం పంచాయతీ బ్లాకులోని ఎలికట్టె గ్రామంలో 1959 డిసెంబరు నెలలో ప్రత్యేక గ్రామ సహాయకుల శిక్షణా శిబిరం ఒకటి నిర్వహింపబడింది. 50 మంది గ్రామ సహాయకులకు ఆధునిక వ్యవసాయ పద్ధతులు, పశుపోషణ, పంచాయతీలు, సహకార సంఘాలకు సంబంధించిన విషయాలలో శిక్షణ ఇవ్వబడింది.

**పంచాయతీ అధ్యక్షుల సమావేశం:-** నల్గొండ పూర్వ విస్తరణ బ్లాకు పంచాయతీ అధ్యక్షుల సమావేశం 1960 జనవరి 5వ తేదీన తిప్పర్తిలో జరిగింది. బ్లాకు కార్యక్రమాలకు సంబంధించిన విషయాలను చర్చించే నిమిత్తం జరిగిన ఈ సమావేశంలో ప్రతి పంచాయతీకి విడివిడిగా కొన్ని లక్ష్యాలు కూడా నిర్ణయింపబడినవి. ప్రతి పంచాయతీ కమిటీ గ్రామీణ పారిశుధ్య కార్యక్రమాన్ని చేపట్టాలనీ, కనీసం 20 మురుగు పారుదల గుంటలనూ, 20 ఎరువు గుంటలను నిర్మించాలని కూడా ఈ సమావేశంలో నిర్ణయింపబడింది.

**నకిరెకల్ సమితి ప్రారంభోత్సవం:-** రాష్ట్రీ నీటి పారుదల, విద్యుచ్ఛక్తి శాఖా మంత్రి 22-12-59 వ తేదీన జ్యోతిని వెలిగించి నకిరెకల్ పంచాయతీ సమితికి ప్రారంభోత్సవం చేశారు. జిల్లా పరిషత్తు అధ్యక్షుడు శ్రీ జి.యస్. రెడ్డి సభకు అధ్యక్షత వహించారు. వ్యవసాయార్థికాభివృద్ధికి తోడ్పడగల సహకార సంఘాలను స్థాపించుకోవలసిందిగా మంత్రిగారు ప్రజలకు విజ్ఞప్తిచేశారు.

ముఖ్యమంత్రి పర్యటన:- రాష్ట్ర ముఖ్యమంత్రి 1959 నవంబరు నెలలో నల్లగొండ జిల్లాలో పర్యటించారు. తృతీయ జిల్లా స్థాయి అభివృద్ధి గోష్ఠికి ఆయన నల్గొండలో ప్రారంభోత్సవం చేశారు. నల్గొండ పట్టణానికి నీటి సరఫరాకై సర్వీసు రిజర్వాయరుకి కూడా ఆయన పునాది రాయి వేశారు.

హుజూర్‌నగర్ సమితిలోని మటంపల్లి గ్రామాన్ని కూడా ముఖ్యమంత్రి సందర్శించారు. ఈ పంచాయతీకి అందరూ స్త్రీలే ఎన్నికయినారు. శ్రీమతి ఛెరమ్మ సర్‌పంచ్‌గా వున్నారు.

సూర్యాపేట సమితి ప్రారంభోత్సవం:- వ్యవసాయశాఖ మంత్రి సూర్యాపేట పంచాయతీ సమితికి ప్రారంభోత్సవం చేశారు.

## నిజామాబాదు

శిక్షణా శిబిరం:- మద్నూర్ బ్లాకులోని దొంగ్లి గ్రామంలో డిసెంబరు 10 నుంచి 12వ తేదీ వరకు ప్రత్యేక గ్రామ సహాయకుల శిక్షణా శిబిరం నిర్వహింపబడింది.

1959 డిసెంబరు 26వ తేదీన జరిగిన మద్నూరు పంచాయతీ సమితి ప్రథమ సమావేశంలో అయిదు స్థాయీ సంఘాలకి సభ్యులు ఎన్నుకోబడినారు.

## శ్రీకాకుళం

నూతన పాఠశాలల ప్రారంభం:- మురపాక బ్లాకులో 1959 డిసెంబరు నెలలో 10 ప్రాథమిక పాఠశాలలు నూతనంగా తెరువబడినవి. ఒక కుట్టుపని కేంద్రం కూడా ఈ బ్లాకులో ప్రారంభింపబడింది.

శిక్షణా శిబిరం:- మందస బ్లాకులోని భైరిసరంగపురం గ్రామంలో డిసెంబరు 25 నుండి 27వ తేదీ వరకు గ్రామ సహాయకుల ఆరవ శిక్షణాశిబిరం నిర్వహింపబడింది. వ్యవసాయం, సహకారం, పంచాయతీలకు సంబంధించిన విషయాలలో ఈ శిబిరంలో శిక్షణ ఇవ్వబడింది.

## విశాఖపట్నం

నూతన నౌక జల ప్రవేశోత్సవం:- యూనియన్ రవాణా, వార్తా సౌకర్యాల మంత్రి శ్రీ రాజ్ బహదూర్, హిందుస్తాన్ నౌకా నిర్మాణ కేంద్రంలో నిర్మించబడిన 29వ నౌక అయిన "స్టేట్ ఆఫ్ ఉత్తర్ ప్రదేశ్"కి 31-12-1959వ తేదీన జల ప్రవేశోత్సవం చేశారు.

చెరకు పరిశోధన కార్యకర్తల మహా సభ:- చెరకు పరిశోధన, అభివృద్ధి కార్యకర్తల అఖిల భారత ద్వివర్ష మహా సభకి వాల్తేరులో 1960 జనవరి మొదటి వారంలో రాష్ట్ర వ్యవసాయ శాఖా మంత్రి ప్రారంభోత్సవం చేశారు.

## వరంగల్

చిన్న మొత్తాల పొదుపు:- వరంగల్ జిల్లా కలెక్టరు, గ్రామాలలో జాతీయ పొదుపుకై విరివిగా పెట్టుబడులను సేకరించే ప్రత్యేక ఉద్యమాన్ని 1959 డిసెంబరు 1వ తేదీ నుంచి ప్రారంభించారు. ఒక్క జనగామ తాలూకాలోనే రూ. 41,030 ల మొత్తం సేకరింపబడింది.

సంస్కృత పాఠశాల వార్షికోత్సవం:- వరంగల్‌లోని శ్రీ విశ్వేశ్వర సంస్కృతాంధ్ర కళాశాల నవమ వార్షికోత్సవానికి 13-12-59వ తేదీన రాష్ట్ర విద్యా శాఖా మంత్రి అధ్యక్షత వహించారు. రాష్ట్ర శాసన పరిషత్తు అధ్యక్షుడు ఈ ఉత్సవాలను ప్రారంభించారు.

ములుగు బ్లాకులో అభివృద్ధి కార్యక్రమాలు:- ములుగు బ్లాకు పంచాయతీ సమితి తొలి సమావేశం ములుగులో 1959 డిసెంబరు మూడవ వారంలో జరిగింది. 1959-60వ సంవత్సరంలో వివిధ అభివృద్ధి కార్యక్రమాలకై రూ. 8.53 లక్షల మొత్తాన్ని సమితి మంజూరు చేసింది. అయిదు స్థాయీ సంఘాలను కూడా సమితి ఎన్నుకొన్నది.

వరదన్నపేట బ్లాకు సమితి సమావేశంలో 1959-60వ సంవత్సరానికై వ్యవసాయాభివృద్ధికి రూ. 15,000లు, ఆరోగ్య, విద్యాభివృద్ధికి రూ. 3,500లు, రహదారి సౌకర్యాలకి రూ. 15,000 ల మొత్తం మంజూరు చేయబడినవి.

## పశ్చిమ గోదావరి

సహకార సేద్యంపై గోష్ఠి:- భీమవరం డబ్ల్యు. జి. బి. కళాశాల ప్రణాళికా గోష్ఠి సంఘం అధ్వర్యాన 1959 డిసెంబరు 14వ తేదీన సహకార సేద్యంపై ఒక గోష్ఠి జరుపబడింది.

# విశేషాలు

## మార్కోపోలో సందర్శించిన మహబూబాబాదు

అందరికీ తెలిసి ఉండకపోవచ్చు. కాని 13వ శతాబ్దంలో భారతదేశానికి వచ్చిన ఇటాలియన్ ప్రయాణీకుడు మార్కోపోలో తెలంగాణాలో చిన్న పట్టణమయిన మానుకొండను (ఇప్పటి మహబూబాబాద్) దర్శించారు. అప్పుడు (క్రీ.శ. 1292) రాణీ రుద్రమదేవి రాజ్య పాలన చేస్తున్నది.

జనవరి 3 న రాష్ట్ర హోం శాఖా మంత్రి శ్రీ ఎమ్. నర్సింగరావుకి సమర్పించిన (స్వాగత) పత్రంలో యీ విషయాన్ని పేర్కొంటూ. అంతర్జాతీయ యాత్రికుల క్లబ్బు అధ్యక్షుడు. మహబూబాబాద్, శ్రీ కె. గోపాలరావు ప్రభుత్వం, దాని అధ్వర్యాన. ఒక రాష్ట్ర యాత్రికుల బోర్డును ఏర్పాటు చేయాలని కోరారు.

క్లబ్బు అధ్వర్యాన భారతీయ యాత్రికుల పోస్టర్ల ప్రదర్శనను ప్రారంభించిన మంత్రిగారు విదేశ. స్వదేశ యాత్రికుల సౌకర్యార్థం అట్టి క్లబ్బులను అన్ని కేంద్రాలలోను ఏర్పాటు చేయాలన్నారు. క్లబ్బు ఆర్గనైజరు శ్రీ బి ఎన్. గుప్తా సాహస కృషిని ఆయన అభినందించారు. మహబూబాబాద్ అడవుల మధ్య ఉన్నందున అది షికార్లకు ఆకర్షణీయమైన ప్రదేశం కాగలదన్నారు. —ఇండియన్ ఎక్స్‌ప్రెస్.

## ఆంధ్ర ఉన్నత పాఠశాలకు బొంబాయి ప్రభుత్వం గ్రాంటు

బొంబాయిలోని ఆంధ్ర విద్యా సంఘం అధ్యక్షుడు శ్రీ వి. రామలింగస్వామికి 19-1-60 న విజయవాడలో శ్రీ వై.ఎస్.వి. రామమూర్తిచే యేర్పాటు చేయబడిన విందు సందర్భంలో ఆ సంఘం చేసిన కృషి పత్రికా విలేఖరులకు వివరింపబడింది. ఇప్పుడు బొంబాయి నగరంలో నడుపబడుతున్న ఆంధ్ర ఉన్నత పాఠశాలలో 550 మంది చదువుకుంటున్నారని. అది అక్కడ గల సుమారు 2 లక్షల మంది ఆంధ్రుల విద్యావసరాలను తీరుస్తున్నదని, విద్యార్థులలో 60 శాతం కార్మిక తరగతులకు చెందిన వారని సంఘం అధ్యక్షుడు చెప్పారు. సమాజానికి వారు చేసే సేవకు గుర్తింపుగా బొంబాయి ప్రభుత్వం రూ. 2 లక్షలను ఇచ్చినది. యీ సొమ్మును రెండు సంవత్సరాలలో 40 గదుల నిర్మాణానికి ఉపయోగించాలని చెప్పారు. గదుల నిర్మాణానికి మొత్తం రూ. 4.5 లక్షలు ఖర్చు కాగలదని. అవి బొంబాయి మునిసిపల్ కార్పొరేషన్ యిచ్చిన 36 వందల చ. గజాల స్థలంలో నిర్మించబడతాయనీ కూడా ఆయన చెప్పారు. ఈ సంఘం యింత వరకు రూ 65,000 లను వసూలు చేసినదనీ. మరొక రూ. 25,000 బొంబాయి వస్త్ర వ్యాపారుల నుంచి వసూలు చేయబడగలవని ఆశించబడుతున్నదనీ చెప్పారు. చేతిలో ఒక లక్ష రూపాయలను పెట్టుకొని వారు మార్చిలో భవన నిర్మాణ కార్యక్రమాన్ని ఆరంభించదలుచుకున్నారు.

## పోలీసు పతకం బహూకరణ

ధైర్యసాహసాలకు,ఉత్తమమయిన ఉద్యోగనిర్వహణకు రాష్ట్రపతి అయిదుగురు పోలీసు అధికార్లకు. పోలీసులకు పోలీసు పతకాలను బహూకరించారు. వీరిలో యిద్దరు మధ్యప్రదేశ్‌కి, మిగిలిన ముగ్గురు మైసూరు, అస్సాం, ఆంధ్రప్రదేశ్‌లకి చెందినవారు.

ఆంధ్రప్రదేశ్‌కి చెందినవారు, ఆంధ్రప్రదేశ్ ప్రత్యేక పోలీసు. ఫస్టు బటాలియన్ జమాదారు శ్రీ బచాన్‌సింగ్. జమ్మూ, కాశ్మీరు పూంచ్ జిల్లాలో 250 మంది సాయుధ దుండగులు పోలీస్ బృందంపైన. తుపాకులనుండి దాడి సందర్భంలో చూపిన ధైర్య సాహసాలకు జమాదారు బచాన్‌సింగ్‌కి పతకం బహూకరించబడింది.

## "పద్మభూషణ్" "పద్మశ్రీ" బిరుదులు

పరిపాలన, విద్య, విజ్ఞాన శాస్త్రం, సంగీతం, ఆటలు,

సాంఘిక సేవ, లలితకళలు, సారస్వతం, మున్నగు రంగాలలో సాధించిన ఘన కార్యాలకు 11 వ రిపబ్లిక్ రోజున రాష్ట్రపతి 37 మందికి అవార్డులను యిచ్చారు.

"పద్మభూషణ్" బిరుదులను పొందిన వారిలో రాష్ట్ర శాసనసభ అధ్యక్షులు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావున్ను, "పద్మశ్రీ" బిరుదు గ్రహీతలలో విజ్ఞాన శాస్త్రవేత్తలు శ్రీయుతులు అయ్యగారి సాంబశివరావు, నూతక్కి భాను ప్రసాద్‌గార్లున్ను ఉన్నారు.

ఈ సంవత్సరం పతకాలను పొందిన 61 మంది పోలీస్ అధికార్లలోను ముగ్గురు ఆంధ్రులు. వివరాలు యివి: విజయవాడలోని సెంట్రల్ ఇంటెలిజెన్సు ఆఫీసర్ శ్రీ మాడభూషి శ్రీనివాసాచార్య, సి.ఐ.డి. స్పెషల్ బ్రాంచి పోలీసు ఇనస్పెక్టరు, హైదరాబాద్. శ్రీ వీసపల్లి వెంకటరమణ, సి.ఐ.డి. స్పెషల్ బ్రాంచి పోలీస్ ఇనస్పెక్టరు, హైదరాబాద్, శ్రీ మల్లెల సత్యనారాయణ.



మనుషులు డబ్బును గురించి మాట్లాడుతారు. డబ్బు ఉపయోగకరమయినదే. ఆ విషయంలో సందేహం లేదు. కాని ఆఖరికి లెక్కలోనికి వచ్చేది మనిషి, చరిత్రను సృజించినదీ, మానవ పురోభివృద్ధికి తోడ్పడినదీ మనుషులే కాని డబ్బు కాదు. భారతదేశంలో సరయిన మనుషుల్ని తయారు చేస్తే మిగిలిన పని దానంతట అదే జరుగుతుంది. మనం దీనిని సాధించగలమనీ, ఆ మార్గంలో గల చిక్కులను తొలగించుకోగలమనీ గడచిన కొన్ని సంవత్సరాల అనుభవం మనకు తెలియ చేసింది.

మన దేశం దశదిశల మానవ శ్రేయస్సుకై కృషి జరిగే కేంద్రాలు వ్యాపించి ఉన్నాయి. అవి దీపాల వలె కాంతిని వెదజల్లుతూ తమ చుట్టుపట్ల గల చీకటిని పారదోలుతున్నవి. ఈ కాంతి దేశమంతటా ప్రసరించవలసి ఉన్నది.

— జవహర్‌లాల్ నెహ్రూ.

# ముఖ్య వార్తలు

21-12-59

ఆంధ్ర నాన్‌గెజిటెడ్ ప్రభుత్వోద్యోగుల సంఘానికి (కేంద్ర సంఘం) గల గుర్తింపును ఉపసంహరిస్తూ రాష్ట్ర ప్రభుత్వం ఉత్తర్వులు చేసింది.

22-12-59

రాష్ట్రంలో త్వరలోనే వ్యవసాయ విశ్వవిద్యాలయం ఏర్పాటు చేయబడుతుందని శాసనసభలో రాష్ట్ర ఆర్థిక మంత్రి ప్రకటించారు. ఇక్కడ కర్షక కుటుంబాలకు చెందిన విద్యార్థులకు, తదితరులకు యేకీకృత వ్యవసాయ కోర్సులలో శిక్షణ ఇవ్వబడుతుంది.

23-12-59

రాష్ట్ర కన్సోలిడేటెడ్ నిధినుంచి ప్రభుత్వం రూ. 10,37,0౦౦—1959-60 గ్రాంట్ల సప్లిమెంటరీ డిమాండ్సు-వాడుకొందుకు అధికారం యిచ్చే బిల్లును ఆమోదించిన పిమ్మట రాష్ట్ర శాసనసభ కాల నిర్ణయం లేకుండా వాయిదా పడింది.

24-12-59

సహకార, గృహవసతి శాఖా మంత్రి హైదరాబాదులో పట్టణప్రాంత సమాజాభివృద్ధిపై అఖిలభారత గోష్ఠిని ప్రారంభించారు.

25-12-59

మిస్టర్ కృశ్చేవ్ శిఖరాగ్ర చర్చలకై మూడు దేశాలు పంపిన ఆహ్వానాన్ని అంగీకరించారు కాని ప్రత్యామ్నాయ తేదీలను సూచించారు.

26-12-59

సమాజంలో ఐక్యతాభావాన్ని కలిగించి తద్వారా ప్రజా సమూహాన్ని ఒక సాంఘిక వ్యవస్థగా రూపొందించటమే సమాజాభివృద్ధి ప్రధానాశయమని హైదరాబాదులో "కమ్యూనిటీ ఆర్గనైజేషన్", పట్టణ ప్రాంతాల అభివృద్ధిపై మాట్లాడుతూ రాష్ట్ర ప్రణాళికలు, అభివృద్ధి శాఖ కార్యదర్శి అన్నారు.

27-12-59

నగరంలో భారతీయ సాంఘిక సేవా మహాసభ 11 వ వార్షిక సమావేశం జరిగింది.

28-12-59

ముఖ్యమంత్రి హైదరాబాద్‌లో అయిదవ భారతీయ ప్రమాణాల మహాసభను ప్రారంభించారు.

29-12-59

రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ దుర్గాపురం ఉక్కు పనుల మొదటి బ్లాస్ట్ ఫర్నేస్‌ను ప్రారంభించారు.

30-12-59

జీవన ప్రమాణాలను అతి శీఘ్రంగా అభివృద్ధి చేయ తలపెట్టిన అభివృద్ధి ప్రణాళికల దృష్ట్యా ప్రభుత్వ సెలవులు 111 నుంచి 93 కి తగ్గించబడినవని ప్రధాన కార్యదర్శి పత్రికా విలేఖరులకు చెప్పారు.

31-12-59

హైదరాబాద్‌లో సమావేశమయిన భారతీయ సాంఘిక సేవా మహాసభ సాంఘిక సంక్షేమానికి కేంద్రంలో ప్రత్యేక మంత్రిత్వశాఖను ఏర్పాటు చేయాలన్న తన ప్రతిపాదనను పునరుద్ఘాటిస్తూ తీర్మానం చేసింది.

1-1-60

ముఖ్యమంత్రి హైదరాబాద్‌లో 20 వ అఖిల భారత పారిశ్రామిక వస్తు ప్రదర్శనను ప్రారంభించారు.

2-1-60

రాష్ట్ర విద్యా మంత్రి హైదరాబాద్‌లో రష్యా ప్రజల శిల్ప వస్తు విశేషాల ప్రదర్శనను ప్రారంభిస్తూ రాష్ట్రంలో త్వరలోనే లలిత కళల అకాడమీ ఒకటి యేర్పాటు కాగలదన్న విషయాన్ని వెల్లడించారు.

3-1-60

గవర్నర్ హైదరాబాద్‌లో 15 వ అఖిల భారత దంత వైద్యుల మహాసభను ప్రారంభించారు.

4-1-60

కలకత్తా-మద్రాస్ జాతీయ రహదారిపై సిద్ధాంతానికి సమీపంలో వశిష్టనదిపై వంతెనకు-ఖర్చు రూ. 94 లక్షలు-ముఖ్యమంత్రి శంకు స్థాపన చేశారు.

5-1-60

6-1-60 నుంచి విద్యుచ్ఛక్తి, నీటి సరఫరా, పబ్లిక్ వర్క్సు శాఖవర్కుషాపు ఉద్యోగులు కాలనిర్ణయం లేకుండా జరుపవలసిన సమ్మెను మజ్దూర్‌సంఘం ఉపసంహరించింది.

6-1-60

బడిపిల్లలకు ఉచిత మధ్యాహ్న భోజనాలను సమకూర్చుటకు ప్రభుత్వం నిర్ణయించినదని రాష్ట్ర విద్యా మంత్రి చెప్పారు. ఈ పథకం యీ సంవత్సరం జిల్లాకొక అభివృద్ధి కేంద్రంలో అమలుపరచబడుతుంది.

లెజిస్లేచర్ కాంగ్రెస్ పార్టీ నాయకుడుగా శ్రీ ఎన్. సంజీవరెడ్డి స్థానంలో శ్రీ డి. సంజీవయ్యను యెన్నుకొందికి ఆ పార్టీలో వివిధ వర్గాలు అంగీకరించినట్లు తెలిసింది.

7-1-60

గడచిన ఫిబ్రవరిలో మొత్తం నాన్‌గెజిటెడ్ ఉద్యోగులంతా చేసిన సమ్మెలో పాల్గొనని ఉద్యోగులకు ప్రొమోషన్‌ల విషయంలో ప్రాధాన్యత యివ్వాలనే ప్రభుత్వ ఉత్తర్వును ఉపసంహరించాలని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించినట్టు ఆంధ్రప్రదేశ్ సెక్రటేరియట్ సంఘం సమర్పించిన వీడ్కోలు పత్రానికి సమాధానం చెబుతూ ముఖ్యమంత్రి ప్రకటించారు.

8-1-60

ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆవరణలోని యావత్తు ఆస్తిని, భవనాలను విశ్వవిద్యాలయానికి అప్పగించాలని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించినట్టు యీ సాయంకాలం విశ్వవిద్యాలయ టెక్నాలజీ కళాశాలా భవనానికి శంకు స్థాపన చేస్తూ శ్రీ ఎన్. సంజీవరెడ్డి ప్రకటించారు.

9-1-60

5 సంవత్సరాలకు తక్కువ కాకుండా పని చేసిన ప్రభుత్వ ఉపాధ్యాయులందరికీ, వారు శిక్షితులుకాకపోయినా, వేతనాల సంఘం సిఫార్సు చేసిన కొత్త వేతనపు స్కేళ్ళను కోరుకొందుకుఅవకాశం యివ్వబడాలని ప్రభుత్వం నిర్ణయించినట్టు రాష్ట్ర ఆర్థిక మంత్రి హైదరాబాద్‌లో జరిగిన పత్రికా విలేకరుల గోష్ఠిలో ప్రకటించారు.

10-1-60

కాంగ్రెస్ అధ్యక్షులు కాబోతున్న శ్రీ ఎన్. సంజీవరెడ్డి స్థానే కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీ నాయకులుగా కార్మిక, అబ్కారీ శాఖా మంత్రి శ్రీ దామోదరం సంజీవయ్య ఏకగ్రీవంగా ఎన్నుకోబడ్డారు. గవర్నర్ శ్రీ సంజీవరెడ్డి మంత్రి వర్గం రాజీనామాను ఆమోదించి కొత్త మంత్రి వర్గం ఏర్పాటుకి శ్రీ సంజీవయ్యను ఆహ్వానించారు.

11-1-60

రాజభవన్‌లో గవర్నర్ శ్రీ దామోదరం సంజీవయ్య మంత్రివర్గంచే ప్రమాణ స్వీకారం చేయించారు. ఈ మంత్రి వర్గంలో 14 మంది మంత్రులు ఉన్నారు.

12-1-60

కొత్త ముఖ్యమంత్రి ఆయా మంత్రుల పోర్టుఫోలియోలను ప్రకటించారు.

13-1-60

పై ప్రాంతాల నుంచి పారుడు వ్యాధి అంటకుండా శ్రీకాకుళం జిల్లాలో రాష్ట్ర సరిహద్దులలో కీలక ప్రాంతాలలో కొన్ని నిరోధక కేంద్రాలను యేర్పాటు చేయాలని విజయవాడలో జరిగిన జిల్లా పశు చికిత్సాధికారుల మహాసభలో నిశ్చయించబడింది.

14-1-60

కొత్త కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ ఎన్. సంజీవరెడ్డి లాంఛనంగా పదవీ స్వీకారం చేశారు.

15-1-60

ఢిల్లీలో వెలువడిన అధికార వార్తా విశేషం ప్రకారం రాష్ట్ర ప్రభుత్వ ప్రతినిధులకు, ప్లానింగ్ కమిషన్‌కి మధ్య జరిగిన చర్చల సందర్భంలో 1959-60 లో రాష్ట్ర వార్షిక ప్రణాళికకు రూ 43 కోట్లు కేటాయించాలని నిర్ణయించబడింది.

16-1-60

ప్రణాళిక శీఘ్ర గమనానికై ప్రజలు, పరిపాలనాసిబ్బంది, తదితరులు యుద్ధసమయంలో అత్యవసర పరిస్థితి వంటి

పరిస్థితి ఏర్పడినదనే భావాన్ని కలిగించుకోవాలని ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ సదాశివనగర్‌లో చెప్పారు.

**17-1-60**

భారత జాతీయ కాంగ్రెస్ 65 వ మహాసభ సమాప్తమైనది.

**18-1-60**

ప్రధాని శ్రీ నెహ్రూ కేరళలో పంచాయతీ రాజ్యం పథకానికి ప్రారంభోత్సవం చేశారు.

నెల్లూరు తాలూకా చినచేమకూరు సీనియర్ బేసిక్ పాఠశాల ప్రధానోపాధ్యాయుడు శ్రీ వి. మల్లికార్జునయ్య ఉపాధ్యాయుల జాతీయ అవార్డు బహూకరణకై ఎన్నుకోబడినట్లు యూనియన్ విద్యా మంత్రిత్వ శాఖ పంపిన ఒక వర్తమానాన్ని బట్టి తెలిసింది.

**19-1-60**

విపత్కర సమయాలలో అసమానమైన ధైర్య సాహసాలు ప్రదర్శించిన అయిదుగురికి అశోక చక్రితమయిన వస్తువులను బహూకరించడానికి రాష్ట్రపతి ఆమోదించారు.

**20-1-60**

సోవియట్ అధ్యక్షుడు క్లిమెంటి వొరోషిలోవ్‌కి పాలం విమానాశ్రయంలో ఘనస్వాగతమివ్వబడింది. 16 రోజుల పర్యటనపై శ్రీ వొరోషిలోవ్ మన దేశానికి విచ్చేశారు.

—:*:—

భారతజాతి అతి ప్రాచీనమైనది. అయినా నేడీ జాతిలో నవ యౌవనం తొణికిసలాడుతున్నది. గతంలో భారత జాతీయ ఔన్నత్యానికి కారణభూతములైన కొన్ని ముఖ్య లక్షణాలు నేటికీ మన గుండెలను కదిలిస్తూనే వున్నాయి. అయితే సాంఘిక, రాజకీయ వ్యవస్థలు, శాస్త్ర సాంకేతిక విషయంలో మనం పాశ్చాత్య దేశాల నుంచి చాలా నేర్చుకున్నాం. యింకా తెలుసుకోవలసింది, చేయవలసింది చాలా వుంది; ముఖ్యంగా సాంఘిక సంక్షేమ సాధనకు శాస్త్ర విజ్ఞానాన్ని వినియోగపరచుకునే కృషిలో. మనకు రాజకీయ స్వాతంత్ర్యం లభించింది. కాని ప్రజల ఆర్థిక పరిస్థితులను త్వరితంగా చక్కదిద్దుకోవటం, దారిద్ర్యం మొదలైన సాంఘిక విపరిణామాలను ఎదుర్కోటం ప్రస్తుతం ప్రధాన కర్తవ్యం. యీ సమస్యలను ఎదుర్కొని విజయం సాధించటానికి బద్ధకంకణులమయ్యాం. దృఢ దీక్ష వుంది; సహజ సంపదలు, మానవశక్తి అపారంగా వున్నాయి. వీటిని మానవజాతి అభ్యుదయానికి వినియోగించటమే లక్ష్యం. యితర దేశాలతో కలిసిమెలిసి ప్రశాంతంగా అభివృద్ధి సాధించటానికి అనువైన పరిస్థితిని మనం కల్పించుకోవాలి. ఒక దేశానికి శాంతి కావాలంటే అది యితర దేశాల్లో కూడా వుండాలి. యుద్ధం, శాంతి, స్వేచ్ఛ అవి భాజ్యమైనవి. అందువల్ల ఏదేశమైనా తన సరిహద్దులలోపల శాంతి సాధించుకుంటే చాలదు. తన చేతనైనంతలో యావత్ప్రపంచ శాంతి కోసం పాటు పడటం అవసరం.

— జవహర్‌లాల్ నెహ్రూ

మహబూబ్‌నగరం జిల్లాలో

# మత్స్య పరిశ్రమ

చేపలు మాంసకృత్తులుగల పుష్టికరమయిన ఆహారం. మనిషి శరీరానికి ఇది ఎంతో అవసరం. పల్లెల్లో నివసించే సామాన్య ప్రజలకు సరసమయిన ధరలకు, మాంసకృత్తులుగల యితర పదార్థాలకంటె చవుకగా కూడా అన్ని సమయాల్లోనూ ఇవి దొరుకుతాయి. మాంసకృత్తులే గాక ఇతర అసేంద్రియ లవణాలు (అంటే కాల్షియం, మాగ్నీషియం, ఇనుము, భాస్వరాలు), క్రొవ్వు పదార్థాలు కూడ చేపలో వుంటాయి. ఇవన్నీ జీర్ణమయ్యే వస్తువులే. చేప బరువులో నూటికి 70 నుంచి 80 పాళ్ళ వరకు నీటి చెమ్మే.

అనాదినుంచీ మానవుడు తన నిత్యావసరాలకు గాను చిన్న చిన్న చెరువుల్లో, కుంటల్లో చేపలను పెంచుతూ వున్నాడు అన్ని రాష్ట్రాలలోను చేపల అధికోత్పత్తిని సాధించటానికి గాను ప్రత్యేక ప్రభుత్వ శాఖలు వున్నాయి.

ఈ పరిశ్రమను శాస్త్రీయ పద్ధతుల్లో వృద్ధిచేయటానికి యెంతో నేర్పరితనం, తగు జాగ్రత్త, అవిరళ కృషి అవసరం. చేపలు సక్రమమయిన నిర్ణీత నీటి ప్రదేశాలలోనే పెరుగుతాయి. ఇవి విక్రయ యోగ్యమయిన ప్రమాణానికి పెరిగేంత వరకు వాటికి సరియైన ఆహారం సమాకూర్చుతూ వుండాలి అందుకు అవలంబించవలసిన పద్ధతి చాలా సులువైనదే అయినా, ఎక్కువ మంది అశ్రద్ధ వహిస్తుంటారు. ఇందు నిమిత్తం మత్స్య పోషణ, చిరు చేపల పెంపకం, వగైరాలకు వేరువేరు దొరువులను నిర్వహించవలసి వుంటుంది. తెలంగాణా ప్రాంతంలో ఇప్పటికి ఆహారయోగ్యమయిన 102 జాతుల చేపలను కనిపెట్టటం జరిగింది.

## ప్రత్యేక సౌకర్యాలు

ప్రథమ పంచవర్ష ప్రణాళిక ప్రారంభం నుంచి మహబూబ్ నగరం జిల్లాలో ఆహారోత్పత్తిని పెంచటానికి చాలా కృషి చేయబడుతున్నది. సత్ఫలితాలు సాధించటానికి జాలరులకు వీలయినంత ప్రోత్సాహమివ్వటానికి అహోరాత్రులు శ్రమ చేసే జాలరులకే చెరువులు కౌలుకీయబడినయ్. దాదాపు నూటికి 90 చెరువులు ప్రభుత్వ స్వాధీనములో వున్నాయి. ప్రతి సంవత్సరం వాటిని కౌలుకీయటం జరుగుతోంది. గత కొద్ది సంవత్సరాలుగా ప్రభుత్వానికి దీనివల్ల రాబడి రెట్టింపు అయింది.

1959-60 లో, 1353400 చిరు చేపలు నిలువ చేయబడినాయి. నిలువ చేయటంలో బ్లాక్ ప్రాంతాలకు ప్రాముఖ్యత నివ్వబడింది. జిల్లా మొత్తంలో సంవత్సరానికి 8 నుంచి 10 లక్షల పౌనుల చేపలు ఉత్పత్తిఅవుతున్నట్లు అంచనా వేయబడింది. ఈ దిగువ పథకాలు ఇపుడు అమలుపరచ బడుతున్నాయి.

1. డిపార్టుమెంటు స్కీములు.
2. కోయిలసాగర్ ప్రాంతాల్లో మత్స్యసంపద అభివృద్ధి,
3. తెలంగాణాలోని నిర్ణీత ప్రాంతాల్లో ద్వితీయ పంచవర్ష ప్రణాళికా పథకాలు.

డిపార్టుమెంటు స్కీము క్రింద చేపలు పెరగటానికి అనుకూలంగా వున్న 2237 చెరువులు, కుంటలు మొత్తం 16560 ఎకరాల జల ప్రదేశంలో (కొడంగల్, గద్వాల్, ఆలంపురం తాలూకాలు మినహా) ప్రభుత్వ శాఖ పరంగా చేపలు పెంచబడుతున్నాయి.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికా పథకాల క్రింద 1958-59 సంవత్సరంలో డిపార్టుమెంటు పర్యవేక్షణతో తాలూకా కొకటి చొప్పున ఎన్నుకున్న 12 చెరువులలోను చెప్పుకోదగిన ఫలితాలు సాధించబడినాయి. దీని మూలంగా రు. 4972లు ఆదాయం వచ్చింది. ఈ 12 చెరువులు మొత్తం 13 టన్నుల 969 పౌనుల చేపలను ఉత్పత్తి చేసినవి. ఈ జిల్లాలో మత్స్యోత్పత్తి ఎకరాకు నికరంగా 50 పౌనులు.

## అధికోత్పత్తి

మామూలుగా చేపలు పారుదలలేని నీటి ప్రదేశాలలో గుడ్లు పెట్టవు. ఇవి విస్తార సంతానోత్పత్తిగల జీవులు.

ప్రకృతిసిద్ధమయిన పరిస్థితులలో నూటికి పది ఇరవై వరకు మాత్రమే వీటి సంతానం జీవించగలుగుతుంది. తరుచు ఎండుతూండే చెరువులలో చిన్న చేపలను పట్టి ఎక్కువ కాలం నీళ్ళుండే చెరువులలోగాని, అన్ని ఋతువులలో వుండే చెరువులలోగాని నిల్వచేయటం ద్వారా ఎక్కువ చేపలను బ్రతికించి తద్వారా అధికోత్పత్తిని సాధించవచ్చు. ఈ సంవత్సరం కృష్ణానది నుంచి సుమారు రెండు లక్షల చేపలను పట్టి నిల్వచేయటం జరిగింది. ఇవి జిల్లాలోని బ్లాకులకు, కోయిలసాగర్ ఫారమ్ అవసరాలకు చాలనే చాలవు. చేపల సంతానోత్పత్తి అనేకాంశాలపై ఆధారపడి ఉంటుంది. ప్రవాహ జలంలో చేపల సంచారం ఒక ప్రదేశానికి కట్టుబడి ఉండదు. కనుక యీ విషయంలో పరిశీలనలు జరపటం కష్టం.

నాగరిక దేశాల్లో ప్రజలు సెలవు వస్తే సామాన్యంగా ఆటలతో గడుపుతారు. అక్కడ చేపలను పట్టటం ఒక సరదా. కేవలం ఒక్క చేపకోసం ఒకదొరువు లేక సరస్సు వద్ద కూర్చుని గంటల తరబడి గడపటం ఓ ఆనందం. అంతేగాకుండా ఇండ్లల్లో గాజుపెట్టెల్లో పెట్టి వాటిని మచ్చిక చేస్తూ వాటి వాటి అలవాట్లను గమనిస్తూ వుంటారు.

చేపలు త్వరగా చెడిపోతాయి కాబట్టి సంవత్సరం పొడవునా అన్ని కాలాల్లో సరసమయిన ధరలకు అవి లభ్యం కావడానికి వీలుగా పరిశుభ్రమయిన పరిస్థితులలో చలువ పేటికలలో వాటిని నిలువచేయటానికి విక్రయ కేంద్రాలు నెలకొల్పబడాలి. ఉత్పత్తి కేంద్రాల నుంచి విక్రయ కేంద్రాలకు తక్షణ రవాణా సౌకర్యాల యేర్పాటుద్వారా ప్రైవేటు వ్యక్తులు ఈ పరిశ్రమను ఆదుకోవచ్చు. ఈ రోజుల్లో చేప గుడ్లను దూర ప్రదేశాలకు కూడ రవాణా చేస్తున్నారు. ఈ గుడ్లను ప్రాణవాయువుతో నింపిన ప్లాస్టిక్ సంచుల్లో పెట్టి ఆ సంచులను మళ్ళీ రేకు పెట్టెల్లో పెట్టి పంపుతుంటారు. ఇలా చేసినప్పుడు, 72 గంటల కాలంలోనూ, నశించే వాటి శాతం నామ మాత్రంగా వుంటుంది. సరయిన పద్ధతిలో నడిపితే మత్స్య పరిశ్రమ వ్యవసాయ మంత లాభసాటిగాను ఉండగలదు. ఒక యెకరా నీటిలో పెంచిన చేపలవల్ల ఒక యెకరం భూమి వ్యవసాయం వల్ల కంటే హెచ్చు ఆదాయం లభిస్తుంది.



మళ్లీ రాతి యుగానికి తిరోగమిస్తే తప్ప, జీవితంలో సంబంధం లేకుండా ఎక్కడో దుర్గాలలో వుండే రోజులు పోయాయి. విజ్ఞాన శాస్త్రం అంటే — "సత్యాన్ని వ్యవస్థీకరించటం'' అని అర్థం. వ్యవస్థీకరణ అంటే సమిష్టికృషి. మనిషి విజ్ఞాన శాస్త్రంతో పాటు మనాలంటే, నాయకత్వం కొత్త పిలుపు అర్థాన్ని పునరధ్యయనం చేయాలి. మన కార్యక్రమం అడుగడుగున నాయకత్వం కలది. అంతా ఒకే స్థాయికి దిగి కలసి పని చేస్తే కాని యీ వ్యవస్థ పనిచేయదు.

— శ్రీ ఎస్.కె. దే.

# "ఆంధ్ర ప్రదేశ్" ప్రకటన రేట్లు

'ఆంధ్రప్రదేశ్' పత్రికలో ఈ దిగువ రేట్లప్రకారం ప్రకటనలు స్వీకరించబడగలవు.

| వివరాలు | మూడు భాషల పత్రికలకు | | | ఒక భాష పత్రికకు | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తి పేజీ రూ | సగం పేజీ రూ | పావు పేజీ రూ | పూర్తి పేజీ రూ | సగం పేజీ రూ | పావు పేజీ రూ |
| లోపలి పేజీ | 200 | 125 | 75 | 100 | 55 | 30 |
| వెనుకవైపు కవరు పేజీ | 350 | — | — | 150 | — | — |
| 2, 3 కవరు పేజీలు | 250 | — | — | 125 | — | — |

ఒక సంవత్సరం కొరకు స్థలమును కంట్రాక్టు తీసుకొన్నవారికి 20 శతి రిబేటు ఇవ్వబడుతుంది.

## షరతులు

1. సాంకేతిక వివరాలు: $10\frac{3}{4} \times 8\frac{1}{2}$" డెమ్మీ.
2. ముందరి టైటిల్ పేజీపై ప్రకటనలు వేయబడవు.
3. పావు పేజీకంటే తక్కువ ప్రకటనలు స్వీకరించబడవు.
4. ప్రకటించవలసిన విషయము, అది వేయబడవలసిన స్థలము మొదలగు వివరాలూ, దానికయే మొత్తమూ ప్రతినెల 8 వ తేదీలోపుగా ఈ కార్యాలయానికి చేరినట్లయితే, ఆ ప్రకటన మరుసటి నెల పత్రికలో ప్రచురింపబడుతుంది. ప్రకటనకయ్యే మొత్తమును మనియార్డరు ద్వారాగాని, లేక క్రాస్‌చేయబడని డిమాండు డ్రాఫ్ట్‌ద్వారాగాని పంపవలెను. డిమాండుడ్రాఫ్టు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార పౌర సంబంధముల శాఖ డైరెక్టర్, హైద్రాబాదు-దక్కన్ పేరిట వ్రాయబడవలెను.
5. ప్రకటన నిమిత్తమై పంపబడు బ్లాకుల విషయంలో తగు జాగ్రత్త వహింపబడుతుంది. అయితే మిషను మీద బ్లాకులు గనుక పగిలిపోయినట్లయితే అందుకు ఈ శాఖ బాధ్యతవహించదు.
6. ప్రకటన ఎంతస్థలంలో ఏ వైనం ప్రకారం వేయవలసిందీ, ఒక భాష పత్రికలో వేయవలెనా, లేక మూడు భాషల పత్రికలలో వేయవలెనా అనే వివరాలను స్పష్టంగా తెలియపరచాలి. ఉత్తర ప్రత్యుత్తరాలను, పైకమును ఈ దిగువ చిరునామాకు పంపవలెను.

డైరెక్టర్,<br>
సమాచార, పౌరసంబంధముల శాఖ<br>
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం<br>
హైద్రాబాదు దక్కన్—1.

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

| | |
|---|---|
| వైశాల్యం | 1,060.41 చదరపు మైళ్ళు |
| జనసంఖ్య | 3,12,60,133 |
| పురుషులు | 1,57,42,912 |
| స్త్రీలు | 1,55,17,221 |
| సగటు వర్షపాతం | 35.65 " |
| అరణ్య ప్రదేశం | 1,40,26,000 ఎకరాలు |
| జిల్లాలు | 20 |
| తాలూకాలు | 183 |
| రెవిన్యూ సర్కిళ్లు | 1,000 |
| పట్టణాలు | 293 |
| గ్రామాలు | 26.450 |
| పంటలక్రింది ప్రదేశం | 2,93.81.000 ఎకరాలు |
| కౌళ్ళ సంఖ్య | 42,42,655 |
| 1958-59 లో నీటి పారుదలను పొందిన ప్రదేశం | 68 లక్షల ఎకరాలు |
| 1958-59 లో వుత్పత్తి అయిన ఆహారధాన్యాలు | 61.56 లక్షల టన్నులు |
| పాల వుత్పత్తి | 15.5 లక్షల గాలన్లు |
| రైలు మార్గాలు | 2,902 మైళ్ళు |
| జాతీయ రహదార్లు | 1,409 .. |
| రాష్ట్ర రహదార్లు | 2,072 .. |
| జిల్లా పెద్ద రోడ్లు | 2,527 .. |
| జిల్లా ఇతర రోడ్లు | 3,458 .. |
| పాఠశాలలు | 28,000 |
| కళాశాలలు | 64 |
| వృత్తి విద్యా కళాశాలలు | 31 |
| ద్వితీయ పంచ వర్ష ప్రణాళిక ప్రమాణం | రూ. 175.37 కోట్లు |

## 1959—60 బడ్జెటు:

| | |
|---|---|
| ఆదాయం | రూ. 71.29 కోట్లు |
| వ్యయం | .. 71.66 .. |
| పెట్టుబడి ఖర్చు | .. 28.30 .. |

